జగ : మస్తాన్! లోపలికి దీసికెళ్ళి వీణ్ణి స్తంభానికి గట్టేసి బొమిక లిరగ దన్ను. అప్పుడుగాని ఈ గాడిదకి బుద్ధి రాదు.

[మస్తాన్ యల్లమందను మెడబట్టి లోపలికి గెంటుకెళతాడు. తెరలో నుంచి 'ఒప్పుకో ఒప్పుకో' అనే మస్తాన్ మాటలతోపాటు కఱ్ఱదెబ్బల ధ్వని, అమ్మో బాబో చచ్చాన్రో, నాయనో అనే యల్లమంద ఆర్తనాదం వినబడుతూ వుంటుంది.]

యల్ల : (తెరలో) ఒప్పుకుంటానండి. చంపకండి బాబో, మీ పాదాలకు మొక్తా, పిల్లలు గలాడ్ని, మీరు జెప్పినట్టే చేత్తా,

[దేశముఖు, పట్వారీలు వికటంగా నవ్వుతూ ఉంటారు. యల్లమందతో మస్తాన్ ప్రవేశం.]

వెంక: ఆ, రా, ఈ కాగితం మీద అంగుష్టం వెయ్.

మస్తాన్: వెయ్ భోసడిక (అని చేయెత్తుతాడు. యల్లమంద వేలు ముద్ర వేస్తాడు.) ఖబడ్దార్, వల్లు దగ్గిర బెట్టుకొని బతుకు పో. (యల్లమంద ఏడుస్తూ వెళ్ళిపోతూ ఉంటాడు.) ఈమధ్య వీడికి కాస్త వల్లు చిమ చిమ లాడింది.

వెంక: వీడి దేముంది? అసలాళ్ళంతా ఇంకా అలాగే ఉన్నారు.

మస్తాన్: ఇయ్యాళ ఒక్కొక్కడు నెత్తురు కక్కాలి, రాని.

జగ : కానీ, నీ యిష్టం వచ్చినట్లుగానీ. నేను మళ్ళీ ఇప్పుడే వస్తాను.

[దేశముఖు లోపలి కెడతాడు.]

వెంక: రాము డెళ్ళి చాలా సేపయిందే. రైతులింకా రాలేదు.

[అంటూ పొగచుట్ట ముట్టించి కాలుస్తూ ఉంటాడు.]

మస్తాన్: దొరలు—వాళ్ళ పని ఇప్పుడు పిలిస్తే వచ్చేటట్టుందా?

వెంక: అందరిమాట అలా ఉంచు. నీ తమ్ముడు కూడా అందులోనే కలిశాడటగా.

మస్తాన్: ఎందుకు కలవడు కాఫిర్ ముండా కొడుకు: ఆ వీరారెడ్డితో దోస్తీ ఊరికే పోద్దా? (ప్రక్కను జూచి) అరుగో దిగుతున్నారు దొరలు.

(వీరారెడ్డి, రామిరెడ్డి, సుభాన్, దాదాల ప్రవేశం.)

దాదా : సలాం మారాజ్.

వెంక: నూర్చుకుని యింట్లో పోసుకోగానే సరిపోయిందీ? ఎన్నిసార్లు కబురు పంపినా ఒకళ్ళూ లెవీ ఇవ్వరు.

వీరా : అసలు పండితేనా నూర్చి ఇంట్లో పోసుకోవటానికి?

వెంక: అదేమిటయ్యా వీరారెడ్డీ. చదువుకున్న వాడివి నీవు కూడా అలా మాట్లాడుతావ్. ఏది తప్పినా సర్కారీ లెవీ తప్పుతుందా?

దాదా : పండితే ఎందుకియ్యం, ఏటా యియ్యటంల్లేదండీ.

సుభాన్: సర్కారీ మాత్రం పండందే ఎట్లా వసూలు చేయమంటారు?

[మస్తాన్ తమ్ముని వైపు చుర చుర చూస్తూ ఉంటాడు.]

వెంక: ఆ ఖానూన్ గొడవ నీకేం తెలుసునోయ్! కొలంటే పాలంటే దొర గారితోపని గనుక, ఏదో ఒకవిధంగా జెప్ప కొన్నాళ్ళునెట్టి కెళతాను. ఇదేం అడ్డగోలుగాదు. సర్కారుతో పని.

రామి : ఇంకానెట్టి కెళ్ళే దేమిటి? ఆ పండిన నాలుగు గింజలూ కాపలాబెట్టి కల్లం దగ్గిరే గుంజుకెళ్ళారాయె! మాకు మిగిలిందే ముంది. పొల్లూ పొలకట్టేగా?

వెంక : మిడికావ్ లేవోయ్! అసలు మీరు బుద్ధి పూర్వకంగా యిస్తే ఎందుకు గుంజు కెళతారు? అయిన మట్టుకు దిగమింగడమేగా మీ పని.

సుభాన్: పూట కూటికి గతిలేదు గాని, మేం దిగమింగి చచ్చేదేమిటి?

వెంక : అందాకా ఎందుకు? ముందు నీ మాట జెప్పు. ఆరేండ్ల కింద సుతీ కున్న బాకీ నీ వింత వరకు తీర్చావ్?

సుభాన్: మా అయ్య బచ్చినప్పు డెప్పుడో ఒక బస్తా గింజలు నాగుకిచ్చావ్. ఆ బాకీ కింద యిప్పటికి 14 బస్తాలు జను కట్టాను. ఇంకా 14 బస్తాలు బాకీ ఉందంటావ్. ఈ బాకీ మరి ఎప్పుడు తీరుద్దో ఏమిటో?

రామి : ఒకటే తీరడం. ఇక నీవు బచ్చినప్పుడే తీరేది.

వెంక : మొదటే ఎక్కడికి పోయాయి ఈతెలివితేటలు? ఆవేళ అయ్యో బాబో అని కాళ్ళా వేళ్ళా బడి పట్టుకెళ్ళడం, తీరా యివ్వాళ ఇవ్వాలి సొచ్చేప్పటికి ఇదీ ఏడ్పు. ఇందులో నేనేమన్నా దగా జేశానంటావా? కావాలంటేనీ వీరారెడ్డితోనే లెక్క చూపించుకో.

వీరా : దీనికి లెక్కతో పనేముందిలెండి. ఆరు సంవత్సరాల క్రితం పట్టుకెళ్ళింది బస్తా గింజలు. ఇప్పటికి 14 బస్తా లిచ్చాడు. ఇంకా 14బస్తా లివ్వాలంటే ఎలా ఇచ్చుకుంటాడు? ఇంతకంటే అన్యాయం యింకేం ఉంటుంది.

వెంక : అయితే యింకేం. నీవు మళ్ళీ కొత్తగా ఒక ఖానూన్ తయారుచెయ్.

వీరా : ఈ జరిగేదంతా ఖానూన్ ప్రకారమే జరుగుతుందా? పోలీసు అమీన్‌కు విందు చేయటానికి గొల్లోడి మేక నెత్తుకు రమ్మని ఏ ఖానూన్‌లో ఉంది?

రామి : భలేమాట జెప్పావ్. ఇంటికొక బండి ఎరువు ఊరికే వీరి కివ్వాలని ఎక్కడ రాసిపెట్టుందో!

సుభాన్: (వీరారెడ్డి వైపు జూచి) ఏం భాయ్! దున్నే దున్నే అరకలూడదీసి పోయి దొరగారి పొలం దున్నాలని కూడా ఖానూన్‌లోనే ఉందా?

వీరా : (వెంకట్రావుతో) ఖానూన్ కేం వచ్చెలెండి. నిరుడు మీ అమ్మాయిగారి పెండ్లికి యింటికి అయిదు రూపాయల చొప్పున వసూలు చేశారు గదా, యింకా ఖానూన్ ఏమిటండీ?

వెంక: చాల్లే పోసుకోలు కబుర్లు. తాతలనాటినుంచీ వచ్చే మామూళ్ళు ఇవ్వాళ పొమ్మంటే పోతయ్యా.

సుభాన్: వీలయితే ఖానూన్, లేకపోతే మామూల్. ఖానులే ఎన్ని మామూళ్ళు లేకపోతే, ఇంత వేడ కట్టారు?

దాదా : ఎందుకు వచ్చిన పంచాయితీ ఇది సుభాన్. వచ్చిన పనేదో చూచుకోక.

వెంక: మీతో నా కెందుకొచ్చిన గొడవ ఇదంతా. ఏమోయ్ దాదే సాయిబూ! మీరంతా రేపు ప్రొద్దున్నే లెవీ ధాన్య కొలవాలి లేకపోతే ఇక మాట దక్కదు.

దాదా : కొలవ కేంజేస్తాంగానీ, అసలు పండందే ఏం జేస్తాం?

సుభాన్: అసలు చెరువులో నీళ్ళు నిలిస్తేనా పండటానికి?

రామి : నిలిచినన్ని నిలుస్తయ్, వాటికి చాలుగా. మనం ఏ గంగలో కలిస్తే ఎవరికేం బట్టింది?

వెంక: ఈ పిచ్చి పిచ్చి వేషాలేమీ సాగవ్. వడ్లు పండకపోతే, జొన్నలు కట్టండి, జొన్నలు పండకపోతే, సజ్జలు కట్టండి.

సుభాన్: సజ్జ లెవడికి పండినయ్ ఈ వూళ్ళో మీకే పండలేదా?

వెంక: అయితే, జొన్నలు గట్టండి.

దాదా : ఆ జొన్నగింజలు కూడా బెట్టపదున్నే పడ్డాయ్. అక్కడొక మొక్క అక్కడొక మొక్క మొలిస్తే, పండినవాడికి కాసిని పండాయ్: లేని వాడికి అదీ లేదు.

వెంక: బెట్టపదునులో వేయకపోతే పసరపదున్నే వేయక పోయారూ, ఎవడొద్దన్నాడు?

రామి : వద్దని ఎందుకనాలి? కట్టిన అరకల్ని ఊడదీయించి, ఆ పదునున్న నాలుగురోజులూ దొరగారి పొలం దున్నించుకున్నారు. చాలదూ!

వెంక: ఏమిటీ సోది? ఇన్నిటికీ కడ్తారా? చెంబూ, తప్పాళా పైకేయించాలా?

వీరా : ముందు నిరుడు వసూలు చేసిన మా లెవీ డబ్బు మా కివ్వండి. ఈ యేటి సంగతి తర్వాత చూద్దాం.

వెంక: ఆ డబ్బు ఇన్నాళ్ళుందా ఏమిటి? అప్పుడే ఇచ్చాం వార్ ఫండుకి.

సుభాన్: ఎవర్ని అడిగి ఇచ్చారు?

వెంక: నిన్నడిగి ఇచ్చేదేమిటోయ్! కావాలంటే, పోయి పంచాయితీ దారుల్ని కనుక్కో.

వీరా : అది మా డబ్బు. పంచాయితీదార్లెవరు దాన్ని ఖర్చు పెట్టడానికి?

రామి ; ఐతే ఇంకేం. అత్తసొమ్ము అల్లుడు దానం జేశాడన్నమాట!

వెంక: ఎవడో ఒకడు చేశాడు. పోయి సర్కారు నడుగు.

వీరా : సర్కారు నడిగేదానికి, ఇక్కడిదాకా రావడ మెందుకు? పదండి పోదాం.

[వీరారెడ్డితోపాటు అంతా బయల్దేరబోతారు]

వెంక: ఏం, అయితే మీరు లెవీ ఇవ్వరన్న మాటేగా?

వీరా : ముందు ఆరువందల యకరాలున్న మీరు గట్టండి.

వెంక: (కోపంగా దిగ్గున లేచి) ఏమిటీ?

సుభాన్: ఏమిటా? ఆరు వందల యకరాలున్న మీరూ, ఇరవై వేల యకరాలున్న మీ దొరగారూ ముందు గట్టండి. తర్వాత మమ్మల్ని అడగండి.

వెంక: మా యిష్టం కడతాం, కట్టం, మీరెవళ్ళురా అడగటానికి?

వీరా : మాటలు కాస్త జాగ్రత్తగా రానీ!

మస్తాన్: ఏయ్ (అంటూ వీరారెడ్డి మీదకు పోతాడు)

సుభాన్: ఖబడ్దార్!

[మస్తాన్ చటుక్కున ఆగిపోతాడు. వెంకట్రావు తెల్లమొగం వేసి వెనక్కి రెండడుగులు వేస్తాడు]

[తెర పడుతుంది]

# 3

# వీరారెడ్డి యిల్లు

[వీరారెడ్డి చెల్లెలు కమల ఉయ్యాల తొట్టి నూపుతూ, పాడుతూ ఉంటుంది.]

జోజో సుందరరూపా
జోజో మా కులదీపా ॥జోజో॥

బాలచంద్రుని రీతి రణము
వైరిమూకల నుగ్గుజేసే
భారమున్నది వీరపుత్రా ॥జోజో॥

నీదు తెలుగు జాతి నణచు
నీచు లందరి పారద్రోలి
శాశ్వతంబగు ప్రజల రాజ్యం
స్థాపనా చేయాలి నీవే ॥జోజో॥

[పాట పూర్తి అవుతూ ఉండగానే వీరారెడ్డి భార్య సీతమ్మ ప్రవేశిస్తుంది.]

సీత : ఈ పిచ్చి పాటలు పాడమంటే ఇక కూడూ నీళ్ళూ ఏం అక్కర్లా.

కమల: ఏం? నీ కీ పాట ఏమీ బాగుండలేదా వదినా?

సీత : ఆ బాగూ ఓగూ మీ అన్నా చెల్లెలికి తెలియాలి. నాకేం తెలుస్తుందిలే అమ్మా!

(వీరారెడ్డి ప్రవేశం)

కమల: (లేని కోపాన్ని నటిస్తూ) ఏమిటయ్యా. నా కీ పిచ్చి పాటలన్నీ నేర్పావ్.

వీరా : పిచ్చి పాటలూ! పిచ్చి పాటలేమిటి?

కమల: వదిన అంటల్లా? పిచ్చియన్నీ నాకు నేర్పి, మంచి పాటలన్నీ వదినకు నేర్పుకున్నావేం?

సీత : చాల్లే ఊరుకో .... .... ఈ పిల్లకి మరీ పెద్దా చిన్నా లేకుండా బోయింది.

కమల: ఏం అన్నయ్యా! నేర్పవ్ నాకు కూడా?

వీరా : నేను నేర్పడమెందుకు? వదిన్నే నేర్పమను.

కమల: (జాలిగా బతిమాలుతూ) వదినా, నేర్పవ్?

సీత : నోరుముయ్ గాలిపిల్లా.

కమల: నీవు నేర్పకపోతే ఆగుతుందనుకున్నావేం? రోజూ నీవు పాడేటప్పుడు నేను వింటల్లా?

వీరా : అయితే ఇంకేం పాడు.

[కమలను పాడవద్దని సీతమ్మ మొగం చిట్లిస్తూ వ్రేలు చూపుతుంది]

కమల: (వదినవంక జూస్తూ, నవ్వుతూ ఉయ్యాల నూపుతూ)

జో అచ్యుతానంద జోజో ముకుందా
రార పరమానంద రామగోవిందా॥

సీత : నోరుమూస్తావా? లేదా? అసలు నిన్ను............

[అంటూ మీది కెళుతుంది: కమల గంతులు వేసుకుంటూ వదినకు దొరక్కుండా ఉయ్యాలచుట్టూ తిరుగుతూ పాడుతూనే ఉంటుంది. వీరారెడ్డి పకపక నవ్వుతూ ఉంటాడు. పాట అయిపోగానే కమల నవ్వుకుంటూ అన్న చాటున చేరుతుంది ]

సీత : మీరుగాదూ, అసలు ఆ పిల్లకింత అలుసిచ్చింది. ఎక్కడికి పోతుం
దిలే మీ చాలు.

వీరా : మా అమ్మాయికి మాచాలు రాక మీచాలు వస్తుందా?

సీత : కనబడతానే ఉందిగా వాదగొండిచాలు.

కమల: (అన్నచాటున ఉండే) మాది వాదగొండి చాలయితే మరి మీదో?

సీత : అట్టాగే పేలుతా ఉండు. అన్నని అవతలకి పోనీ, చెప్పుతా నీ పని.

కమల: కొడ్తావా? కొడ్తే అబ్బాయి నెత్తుకోనుగా!

సీత : ఎత్తుకోకపోతే నీ పున్నెమాయెలే. అబ్బాయికీ నీ బుద్ది నీ అన్న
బుద్దీ అబ్బకుండా ఉంటే అంతే చాలు.

కమల: మీ అన్నబుద్ధి రావాలా?

సీత : మా అన్నబుద్దే వస్తే బాగానే బతికిపోతాడు.

కమల: ఇక రాకరాక మీ చాలే రావాలమ్మా.

సీత : (నవ్వుతూ) ఏం? మా చాలువస్తే నీ కూతురు నివ్వవా మా అబ్బా
యికి? సరే ఇవ్వకపోతే మాన్లే.

కమల: (సిగ్గుతో తలవంచుకొని) ఛీ పో. నీ కెప్పుడీ మాటలే!

(అంటూ లోపలి కెళ్ళిపోతుంది)

(సీతమ్మ, వీరారెడ్డి నవ్వుతూ కమలవైపు చూస్తూంటారు.)

సీత : అచ్చంగా అత్తయ్య నడకే.

వీరా : అవును. అంతా మా అమ్మే.

సీత : అందుకనే అమ్మ కోరిక తీర్చారుగా.

వీరా : ఏం?

సీత : ఇంకా ఏమంటే ఏం? అమ్మాయి పెండ్లి కండ్లతో చూడాలని పాపం
ఎంతో మొత్తుకుంది ఆమె. విన్నారూ మీరు?

వీరా : మా అమ్మ చనిపోయేటప్పటికి దానికి పదేండ్లన్నాలేవు. అప్పుడే ఏం పెళ్ళి?

సీత : ఇంకా నయం: అమ్మాయి కప్పటికి పదేళ్ళన్నా ఉన్నాయి. నా పెళ్లి నాటికి నా కావేళ్ళేగా!

వీరా : అందుకనే ఊరుకున్నావ్. లేకపోతే ఈ దేశాలు పట్టుకొని తిరిగే వాణ్ని. చేసుకునే దానివేనా?

సీత : చాల్లెండి!ఏంటా మాటలు? ఆడకాడికి మరీ చిన్నపిల్లలై పోతున్నారే?

వీరా : ఏముంది? ఉన్నమాట అన్నాను.

సీత : మాటల కేమొచ్చె. ఇప్పుడైతే మీరు మట్టుకి చేసుకునే వాళ్ళా ఏమిటి, ఈ చదువురాని పిల్లని! ఎవళ్ళ అదృష్టం ఎవళ్ళు దప్పిస్తారు.

వీరా : అట్టె జూస్తే నీకూ్కడ మాఅమ్మకి బట్టిన చాదస్తమే పట్టినట్టుంది.

సీత : మీకట్టాగే కనబడుతుంది లెండి. అమ్మాయికంటె ఏడేనకాల బుట్టిన పిల్లలందరకీ పెళ్ళిళ్ళయినాయి. ఎంకమ్మ వదినగారి పెద్దమ్మాయి మన కమల తోటిదిగాదూ? దానికొక కూతురు.... మళ్ళీ ఇప్పుడు....

వీరా : (నవ్వుతూ) ఓహో కమలకు పెళ్ళి చేసి త్వరగా కోడల్ని చూచు కోవాలని వుంవన్నమాట నీకు.

సీత : చాల్లెద్దురూ మీ సరసం: కష్టం సుఖం ఏమీ ఆలోచించరు. ఇంతకూ మీ అమ్మే ఉంటే నాకీ చిక్కే ఉండదు.

వీరా : ఏం? ఇప్పుడు వచ్చిన చిక్కేముంది?

సీత : ఎన్ని చెప్పినా పరాయి అమ్మ గన్నబిడ్డని. ఏ కాస్త లోపం వచ్చినా తలా ఒక మాట నన్నంటారు, మీకేం? మొగాళ్ళు.

వీరా : (నవ్వుతూ) పిచ్చిదానా, నింద నీకొస్తే ఒకటీ, నా కొస్తే ఒకటీనా? ఇది తొందరపడితే అయ్యే పనా? తగిన సంబంధం దొరకొద్దూ?

సీత : దొరకడానికి అసలు మీరాలోచిస్తేగా? మీపనేమో, మీరేమోగాని, ఎక్కడ కెళ్ళినా అమ్మలక్కలంతా 'ఇంకా మీ ఆడబిడ్డ నెన్నాళ్ళు అట్టె పెడతారమ్మా పెండ్లి చేయకుండా, ఆయనకి తెలియకపోయినా, నీకన్నా తెలియదా? అనేవాళ్ళే. ఏంజేయను? తలకాయ వంచుకొని పైకి రావలసి వస్తావుంది.

వీరా : లోకులకేం, ఎన్నయినా అంటారు. అంతమాత్రాన మనం ఉలిక్కి పడితే ఎలా? సరే, ఈమేడు తప్పకుండా చేస్తాంలే.

సీత : మరి ఎక్కడన్నా మాట్లాడారా?

వీరా : ఆఁ హుజూర్ నగరంలో.

సీత : ఎన్నేళ్ళుంటాయి అబ్బాయికి? ఆస్తి ఏమన్నా ఉందా?

వీరా : ఆఁ తిండికీ, గుడ్డకీ ఏం లోపం ఉండదులే. కుర్రాడు ఖమ్మంలో చదువుతున్నాడు.

సీత : ఎట్టా వుంటాడు?

వీరా : అమ్మాయికంటే ఒక చాయ తరుగనే కాని, కుర్రాడికేం బాగానే వుంటాడు.

సీత : దాని పొడుగాను చాయకేం వచ్చెలెండి, కొరుక్కు తింటామా. ముక్కూ, మొగం సరిగా ఉండాలిగాని, మాగమాసంలో మంచి లగ్గా లుండయ్యేంటగా?

వీరా : అందాకా ఎందుకు? ఆ కుర్రాడు పదిరోజుల్లో ఇక్కడికే వస్తాడు.

సీత : అప్పుడే ఇక్కడ కెట్టా వస్తాడం!! మీదంతా మరీ విడ్డూరం.

వీరా : ఇక్కడే అన్నీ మాట్లాడొచ్చు రమ్మన్నాను. పనిలో పని, అమ్మాయిని అబ్బాయి చూడొచ్చు, అబ్బాయిని మీరూ చూడొచ్చు!

సీత : అదేంటండీ పెండ్లికొడుకే వచ్చి మాట్లాడుకోవడ మేమిటి? వాళ్ళ తరఫున పెద్దాళ్ళేవళ్ళూ లేరు?

వీరా : ఇది వెనుకటి కాలం గాదు. ఇప్పుడు పెళ్ళిళ్ళంతేలే.

సీత : అవునులే. మీకొక ఆచారం ఉందిగాబట్టి ఇది లేదనా? సరే ఇది కూడా మీయిష్టం వచ్చినట్టే కానియ్యండి. ఎట్టాగో ఒకట్టా ముందా మూడుముళ్ళు పడితే తర్వాత చూద్దాం.

వీరా : ఇందాకా వచ్చినాక ఇంకా ఆగుతుందా? మాఘమాసంలో కాకపోతే చైత్రమాసంలో అవుతుంది.

సీత : ఇంకా నయం చైత్రమంటారు, వైశాఖ మంటారు. ఆ పిల్ల నెత్తిన ముందా చిట్టెడు గింజలు పడేదాకా నాకేం తోచదు.

వీరా : ఏం?

సీత : ఇంకా ఏమంటారేమిటి? మొన్న తిరణాల్లో ఆ సచ్చినాళ్ళు ఎంటబడిన పట్టానికి మన రామయ్యే లేకపోతే మా బతుకేమయ్యేది! నాకు మొదటి నుంచీ భయంగానే ఉంది. అందుకనే 'పెండ్లిగాని పిల్లని తీసుకొని తిరణాలకు నేనెందుకండీ' అని గోలబెట్టా. వినిపించుకుంటేగా?

వీరా : ఆ వెధవలకి జడిసి, ఇంట్లోనే కూచుంటామా, ఎక్కడికీ వెళ్ళకుండా?

సీత : ఏంజేస్తాం కూచోక. దుష్టుడికి దూరంగా ఉండమన్నారు పెద్దలు.

వీరా : ఎక్కడుంటావ్ దూరంగా. లొంగినకొద్దీ మరీ నెత్తి కెక్కుతారు. ఆ గాడిద లింటిమీద మాత్రం వచ్చి పడగూడదా? ఇలాంటి వెన్ని జరగలా? ఇదివర కీవూళ్ళో.

సీత : ఎందుకు జరగాలా? ఆ పాపిష్టోళ్ళు ఎంతపని అయినా చేస్తారు.

వీరా : అమ్మాయికంటే ఇవ్వాళ గబగబా పెళ్ళిజేసి బైటకి పంపేంవాపే అనుకో, రేపు నీ జోలికే వస్తారు. అప్పుడైనా ఎదిరించక తప్పదుగా.

సీత : అకాడికొ స్తే చావనన్నా చస్తాగాని ఆ సచ్చినోళ్ళకి చిక్కకేం ?

వీరా : చచ్చి ఎవర్ని సాధిస్తావ్. ఎదిరించి వాళ్ళకి తగిన బుద్ధి జెప్పాలి గాని.

సీత : ఏం ఎదిరిస్తాం ఆడోళ్ళం ?

వీరా : మీరు తల్చుకుంటే ఈ రౌడిలొక లెక్కా ? మొన్న మల్లారెడ్డి గూడెంలో ఏం జరిగింది ? మిలటరీ వచ్చి ముట్టడేస్తే ఊరంతా కలిసి ఎదిరించారు. ముఖ్యంగా స్త్రీలు కూడా ప్రాణానికి తెగించి ముందు నుంచుని పోట్లాడారు. అనేకమంది తుపాకి కాల్పులకు గురి అయ్యారు.

సీత : (ఆశ్చర్యంగా) ఏమిటి ? ఆడోళ్ళుకూడా పోట్లాడారా ?

వీరా : ఆఁ పోట్లాడి ముగ్గురు చచ్చిపోయారుకూడా.

సీత : ఆఁ ఎంత ధైర్యం చేశారు.

వీరా : ఏం ? నీవు మాత్రం చెయ్యవ్ ? మొన్న తిరణాల దగ్గిర సమయానికి రామిరెడ్డి ఉండడనుకో; అప్పుడు నీవేం చేసేదానివి ? అమ్మాయిని అల్లరిచేస్తూ ఉంటే చూస్తూ ఊరుకునే దానివా ?

సీత : నా బొందిలో ఊపిరుండగా అమ్మాయిమీద చేయి బడనిస్తానా ?

వీరా : షెబాస్ ! ఎప్పటికైనా అంతే అనుకో మీ అంతట మీరు నిలబడాలి గాని ఒకళ్ళమీద ఎందాక ఆధారపడతారు ?

సీత : ఎందుకు నిలబడం ? మీతోపాటే మేం.

వీరా : అయితే ఇంకేం ? నీవుకూడా సంఘంలో జేరు. కమలా ! కమలా ! (కమల లోపలనుంచి 'ఆఁ' అంటూ వస్తుంది) సంచిలో సభ్యత్వం పుస్తకం ఉందిగాని తీసుకురా. మీ వదిన సంఘంలో చేరుతుంది.

కమల: (ఆశ్చర్యంగా) మా వదినా ? (సీతమ్మవైపు చూచి) ఏం వదినా ? (సీతమ్మ నవ్వుతుంది)

వీరా : ఊఁ (కమలను పుస్తకం తెమ్మని సైగ జేస్తాడు. కమల రివ్వున లోనికి పరుగెత్తి పుస్తకం తెచ్చి వీరారెడ్డి చేతికిస్తుంది. వీరారెడ్డి పుస్తకంలో సీతమ్మ పేరూ, వగైరా రాస్తుంటాడు.)

కమల: ఏం వదినా, సంఘంలో చేరగానే సరిపోదు. నాతోపాటు నీవు కూడా మనాళ్ళందరినీ సంఘంలో చేర్పించాలమ్మా !

సీత : (వీరారెడ్డి వంకజూచి నవ్వుతూ) చేర్పించక తప్పుతుందా? సంగంలో జేరాక, సంగం పెద్ద జెప్పినమాట వినాలిగా మరి.

(వీరారెడ్డి నవ్వుతూ, పుస్తకం కమల చేతికిస్తూ వదినచేత వేలుముద్ర వేయించమని సైగజేస్తాడు. కమల వదినచేత వేలుముద్ర వేయించి, హుషారుగా పుస్తకం పైకెగరేస్తూ పాట పాడుతుంది.)

ఓ మాతా....ఓ భారతమాతా
కదనభూమి కురక నేడె
కదిలినాము ఓహో మాతా ॥ఓ మాతా॥

వదలుమమ్మ నీదు చింత కదలీ నా మిదే
గదిమి అరుల గూల్చేదమమ్మా
ఝాన్సీలక్ష్మి రుద్రమాంబ
శౌర్యపటిమ చాట నిదే
కదిలినాము ఓహో మాత ॥ఓ మాతా॥

కమల: (పాట అయిపోవడంతోనే వదినను కౌగిలించుకొని) నీవుకూడా పాడాలమ్మా ఇక సంఘం పాటలు.

(దాదా ప్రవేశం)

సీత : (కమల తలమీద చేయివేసి నిమురుతూ) నేనేం పాడతానే; నాకు రావుగా.

కమల: నేను నేర్పుతానుగా.

దాదా : (నవ్వుతూ) నేర్పమ్మా నేర్పు. ఆడవిడ్డ అర్థమొగుడని ఊరికే అన్నారూ మరి.

సీత : ఏం నేర్పినా, రేపు వచ్చే మాగమాసందాకానేగా. పద, తలదువ్వుతా.

దాదా : అదేంటమ్మాయ్, అట్టాంటావ్?

సీత : అమ్మాయికి సంబంధం కుదిరింది దాదా! [వీరారెడ్డి వంక జూచి] తమ్ముడు జెప్పకుండా ఉన్నాడంటలే.

[సీతమ్మ, కమల వెళ్ళిపోతారు.]

వీరా : అదే మొన్న నీకు జెప్పిన సంబంధమేలే. ఊళ్ళో కబుర్లేమిటి?

దాదా : ఏమున్నాయి! మరీ మా మస్తాన్‌కి పోయేకాలం వచ్చినట్టుంది.

వీరా : ఏం మళ్ళీ ఏమన్నా జేశాడా?

దాదా : వెనకటికి మల్లే మళ్ళీ కోడిపెట్టల కోసం పోయి గూడెం మీద పడ్డాడు. వాళ్ళు నలుగురూ పోగై తలా ఒక తన్ను తన్నారు.

వీరా : మంచిపని జేశారు.

దాదా : ఇక అక్కడేం ఏడవలేక ఇంటికొచ్చి ఇదంతా సంగంవాళ్ళే చేశారని నిన్నూ నన్నూ సుభాన్నూ గలిపి నోటికొచ్చినట్టల్లా తిడతన్నాడు.

వీరా : అంతేలే, అంతకంటే అతను చేయగలిగే దేముంది?

దాదా : ఆ పెద్ద మనుషుల్ని ఎందుకు తిడతావని వాడి పెండ్లాం ఏదో కాస్త కలగజేసుకొంది. ఆమోయినఆ పిల్లను పట్టుకొని పాపం చావచితక కొట్టాడు దరిద్రుడు.

వీరా : ఏమి చేతగాని ఇలాంటి వెధవ లందరికి చివరికి పెండ్లాం లోకువ.

దాదా : అంతే. ఉరుమి ఉరిమి చివరకు మంగలం మీద పడ్డట్టుంది.

వీరా : అమ్మాయి కమలా! కాసిని మంచినీళ్ళు తీసుకురా అమ్మా!

[యల్లమంద ప్రవేశం. వంటి మీద అక్కడక్కడా సున్నం రాసి ఉంటుంది.]

దాదా : ఏం యల్లమందా, ఎట్టా వున్నావు?

యల్ల : [దెబ్బలు చూపెడుతూ] ఇట్టా వుంటా మత్తానయ్య దయవల్ల. [అంటూ ఉయ్యాల దగ్గిర కొచ్చి] ఏం చిన్న దొరా, నిద్దరోతుండావా?

సీత : [మంచినీళ్ళు తీసుకొస్తూ] లేపవాకు యల్లమందా,ఏడ్చి ఏడ్చి ఇప్పుడే పండుకున్నాడు.

[మంచినీళ్ళ గ్లాసు వీరారెడ్డి కంధిస్తుంది. గ్లాసు నందుకొని వీరారెడ్డి మంచినీళ్ళు త్రాగుతూ ఉంటాడు. సీతమ్మ వెనక కమల కూడా ప్రవేశిస్తుంది.]

యల్ల : [నవ్వుతూ] ఇంకా రెండేళ్ళు పోతే మా సిన్న దొరకూడా సంగం పెడతడు.

వీరా : (నవ్వుతూ) ఏమిటి యల్లమందా ఈ అలవాటు? చిన్నప్పటినుంచే దొరా దొరా?

యల్ల : ముద్దుకు పిల్చుకుంటన్నలే అయ్యా.

వీరా : సరేగాని ఆ చేతిమీద దెబ్బ ఏమన్నా తగ్గిందా?

యల్ల : (దెబ్బ జూపెడుతూ) అన్నీ తగ్గినయ్ గాని దీని దుంపదెగ ఇదే కాస్తి ఇంకా నొప్పిగా ఉంది.

సీత : ఏది యల్లమందా? (దగ్గర కొచ్చి యల్లమంద చేతిపైపు జూచి) అబ్బా! ఎంత కదుంగట్టింది! కమలా లోపలికెళ్ళి.... అదేమిటి?.... అదేనే....

కమల: అమృతాంజనమా?

సీత : ఊఁ, అదే, ఆ సీసే తీసుకురా (కమల లోపలి కెడుతుంది.)

యల్ల : (దాదా వంక జూచి) ఏం లేదుగాని సిన్నయ్యా, ఒక బుద్ది తక్కువ పని జేసిన్నే.

దాదా : ఏం జేశావ్.

యల్ల : ఆ దుంచుముట్టోడు నాచేత ఏలద్దించు కున్నడే.

కమల: (సేసా తీసుకొస్తూ) దుంచుముట్టో డెవడు?

యల్లి: ఉండాడులే, అమ్మా ఉండాడు. ఒక పిలికోడు.

వీరా : ఆ కాగితపు ముక్కతో ఆ పట్వారీ చేసి చచ్చేదేమీ లేదులే. భయపడకు.

యల్లి: ఏమీ లేదుగంద!

[కమల చేతిలోనుంచి సీతమ్మ సీసా తీసుకొని యల్లిమంద చేతికి రాయబోతుంది.]

యల్లి: [అరచేయి జాపుతూ] వద్దులే అమ్మా వద్దులే, ఇట్టబొయ్యి, నేను రాసుకుంటాలే.

వీరా : ఫర్వాలేదులే రాయనియ్ యల్లమందా. కొస్త మెత్త బడుతుంది.

[సీతమ్మ రాస్తూ ఉంటుంది.]

యల్లి : బంగారు తల్లి నూరేండ్లు బతుకమ్మ.

[రామిరెడ్డి, సుభాన్ ప్రవేశం]

దాదా : ఏమోయ్ సుభాన్! రోజూ నాకంటె ముందే వచ్చేవాళ్ళుగా? ఇవాళ్ళ యింత వెనకమాల వచ్చారేం?

సుభాన్: ఏముంది? రామిరెడ్డి గిత్త ఎటో పోతే, దానికోసం తిరుగుతున్నాం.

వీరా : ఏది, ఆ ఎల్లగిత్తా?

రామి : అదే.

దాదా : ఎటుపోయింది? ఏమన్నా జాడ తెలిసిందా?

సుభాన్: ఆఁ ఆఁ!

వీరా : ఎక్కడుంది?

రామి : ఇంకా ఎక్కడుంటుంది? గడీలో!

దాదా : గడీలో! అక్కడ కెట్టాబోయింది?

వీరా : ఎలా బోతుంది! తోలుకుపోతే పోయివుంటుంది?

రామి : చెరువుకి నీళ్ళకుబోతే, వాళ్ళ మందలో గలిపి తోలుకెళ్ళారు.

యల్లి : ఆ ఎదవలకి అది అలివిగాకేం? ఆవులెక్రినబడి అదే పోయి వుంటుంది.

సుభాన్: వాళ్ల దొడ్డికి పోవడంతోనే దివాణపు ముద్దరేసి, కొట్టంలో కట్టేసుకున్నారు.

సీత : ఎంత గోరకలి!

దాదా : [విచారంగా] ఏం గిత్త! అయిదు వందలంటే ఇయ్యాళ దాన్ని కళ్ళు మూసుకొని తోలుకెళతారు.

రామి : అయిదు వందలామె, పది వందలామె! మందు కాడికింద పడింది గదా! ఎట్ట జావాలంట!

వీరా : సరే, ఇవ్వాళ మీటింగులో దీన్ని గురించి కూడా గట్టిగా ఆలోచిద్దాం. ఇలా తోలుకెళ్ళిన గిత్తలు మొత్తము ఎన్ని ఉన్నాయో ఇంటింటికి తిరిగి లెక్కతీద్దాం. కొత్త నీళ్ళతో పాటు పాత నీళ్ళు కూడా కొట్టుకు రావాలి. అందాకా నా దగ్గర మిగులెద్దుందిగా. దాన్ని అడ్డం బెట్టి పని జరుపు.

రామి : పని జరుపుకోడానికేంగాని, దెబ్బలు తగిలిననాడు కూడా నా కింత కష్టమనిపించలేదు బావా. నా గిత్తల రెంటిని బండి కడితే కన్ను మూసి కన్ను తెరిచేటప్పటికి పోయి పేటలో వాలేయి. సరీ దాని దుంపతెగ అది వంటిమీద చేయి వేయనిచ్చేదా? లేదు! ఇవ్వాళ పళ్ళెంకాడ కూచుంటే నోట్లోకి ముద్ద పోలేదే.

దాదా : నిజమే అనుకో నాయనా, కన్నబిడ్డకంటే ఎనిమిక్కిలిగా చూచుకునే గిత్త పోయిందంటే ఎవళ్ళకయినా అట్టాగే ఉంటది.

సుభాన్: వాడి రోజులు దగ్గరబడే, ఇయ్యాల దీన్ని తోలుకెళ్ళాడు.

సీత : పాపిష్టి ముండాకొడు కింకెన్ని జేస్తాడో!

కమల: చేయాలసిన పనులన్నీ ఇదివరకే చేశాడు.

వీరా : అవును. నిరుడు పట్టుకు నిరుడేం జేశాడు! మన సుబ్బయ్యన్న గారి బీడ్లో వాడి మంచను దోలి అదేమిటంటే, ఇది నా బీడే అనలా?

యల్ల : నిజమే. ఆడి మంచమీద మెకం బడ.

దాదా : ఏం బీడు! బీడంటే బీడా! వరాల బీడు. అట్టాంటి బీడు మన ఊరి మొత్తానికే లేదు.

సుభాన్: అందాకా ఎందుకు? చెరువులోతట్టు నాదే అని ఈ యేడు దున్ని సైరు వేయలా?

యల్ల : అదేందిబాబూ. సరకారి పోరంబోకలకు కూడా కంపగొట్టి ఆకట్టు కొన్నాడుగా! నా గొర్రెపిల్ల మెసలడానికి కూక్కడా నీల్లేకుండా జేసిండు. ఆ సరకారేడ జచ్చిందో!

వీరా : సర్కారే సరిలయింది అయితే, మనకి తిప్పలే లేవు. అందుకనే మనం అసలు ఈ ప్రభుత్వమే పోవాలంటున్నాం.

యల్ల : అబ్బో! అట్టంటే మన సుభానయకు కోపం రాదూ?

రామి : ఎందుకు?

యల్ల : నవాబుగారి పెత్తనం పోవడానికి సాయబు లొప్పుకోకేం!

సుభాన్: అసలు ముందు ఈ దేశముఖు పెత్తనం పోవడానికి యల్లమంద ఒప్పుకుంటేగా!

యల్ల : అందేందయ్యో సుబానయ్యా, నేను ఒప్పుకోకపోవడమేంది! ఆడు బోవాలిగాని, అమ్మోరుకి ఏట బోతునియ్యనూ!

వీరా : (నవ్వి) దేశముఖు కూడా మన మతపోడేగా యల్లమందా!

యల్ల : ఏందిబాబూ. నీవు కూడా అట్టా అంటావ్. మన్ని పీక్కుతినే వాడు ఎవడైతేం, పోవలసిందే.

దాదా : మీ దేశముఖు మీ హిందువుల కెంత ఒరిగిస్తన్నాడో, మా నవాబు మా సాయబులకూ్కడా అంతే ఒరిగిస్తన్నాడులే.

రామి : వాడొరిగించి చచ్చేదీలేదు. వీ డొరిగించి చచ్చేదీలేదు; ఇద్దరూ కలిసి మన నెత్తురు తాగేవాళ్ళే!

సుభాన్: అంతే. దొంగలు దొంగలు కలిసి ఊళ్ళు పంచుకోవడమే.

యల్ల : ఎట్టయినా అసలు నవాబు మన దేశముఖంటోడు గాదంటరే. ఆయన సాలా మంచోడంట!

కమల: అలాగే ఉంటుంది, దూరపు కొండలు నునుపు. ఈ జరిగే దుర్మార్గాలన్నీ ఆయనకి తెలియకుండానే జరుగుతున్నాయా? ఆకునూరులో ఏం జరిగింది? మాచిరెడ్డిపల్లిలో ఏం జరిగింది?

యల్ల : ఓ( అమ్మాయికి చాలా పెద్ద పెద్ద సంగతులు తెలుసునే.

సీత : తెలియడ మేమిటి? వాటిమీద ఒక పాట కూడా పాడతంది.

యల్ల : ఏంటీ! పాట, పాడమ్మా పాడు.

కమల: పాటలే దేమిలేదు. వట్టిదేలే యల్లమందా (అంటూ సిగ్గుతో కొంచెం తలవంచుకుంటుంది.)

దాదా : మా సీతమ్మ నోటినుంచి అబద్ధం రాకేం! పాడమ్మా పాడు.

వీరా : ఊ( పాడు. ఇక ఎలాగైనా నీకు తప్పలేదు.

కమల: ఒక్కదాన్నే పాడితే ఏమీ బాగుండదు.

సీత : అయితే ఇంకేం. ఎవరొద్దన్నారు? అన్నా చెల్లెలు కలిసే పాడండి.

[వీరారెడ్డి, కమల కలిసి పాడుతూ ఉంటారు]

నరకూప మీ క్రూర నిరంకుశ
నైజాము పాలన రైతా॥
కరకర పేదల గొంతులు కోసే
కసాయి పాలన రైతా॥

కళలకు సిరులకు నిలయమైన
ఈ తెలంగాణ నో రైతా॥
మలమల మాడ్చుచు వల్లకాడుగా
మార్చె ప్రభుత్వము రైతా॥
మాన రక్షణకు ప్రాణమిచ్చు మన
మహిళామణులకు రైతా॥
మానభంగమా! చిత్రహింసలా
మన కట్టెదుటనె రైతా॥

నలుబది మందిని ఆకునూర నా
నడిబజారులో రైతా॥
ఖలులీ నైజాం పోలీస్ మృగములు
కట్టి చెరచిరో రైతా॥
ఏకవస్త్రలని గర్భిణి స్త్రీలని
ఎంచ వైరిగా రైతా॥
లోకములో ఈ హింసలు రాక్షసి
మూకలు చేసెన రైతా॥
పైదుని బెట్టి పలువలు విప్పి
కారము గొట్టిరి రైతా॥
లేదింతకు మించిన యమలోకము
లేదు లేదురా రైతా॥
ఎందుకురా నికృష్ట జీవితం
ఎందుకురా రైతా॥
అందరు కలసి ఎదిరించా లిదే
ముందుకు రారా రైతా॥

(పాట వింటూ ఉన్నంతసేపూ అందరి కండ్లవెంట నీళ్ళు తిరుగుతాయి.)

దాదా : (విచారంగా వీరారెడ్డితో) ఏం బాబూ, ఇదంతా నిజమేనా!

రామి : నిజమేనా ఏమిటి! ఇదంతా నా కండ్లార చూస్తేను. ఏం వీరారెడ్డి బావా, ఏదో, ఉత్తరం ఇచ్చిరమ్మని ఆయాళ నీవు నన్ను ఆకునూరు బంపలా! అప్పుడామె ఎవరోవచ్చి ....ఆఁ.... ఏమిటి ఆమె పేరు....

కమల: ఎవరు, పద్మజా నాయుడా?

రామి : ఆఁ ఆఁ ఆమెగారే. ఒక్కొక్కళ్ళు ఆమెగారి దగ్గర కొచ్చి తమ చెరలు చెప్పుకుంటుంటే నాకడుపు తరుక్కు పోయిందనుకో.

దాదా : [వీరారెడ్డితో] ఎవరు బాబూ ఆ మాతల్లి.

సుభాన్: సరోజినిదేవి కూతురు.

సీత : ఆమె దేవూరు?

వీరా : మన హైదరాబాదే. సరోజినీదేవి అంటే సామాన్యురాలు గాదు. కాంగ్రెసులో గొప్ప నాయకురాలు.

యల్లి : కొంగిరేసేంది బాబూ?

వీరా : ఇక్కడ మన ఆంధ్రమహాసభలాగే దేశంలో అదొక పెద్ద సంఘం. ఎప్పుడన్నా గాంధీగారి పేరు విన్నావా!

యల్లి : గ్యాంధీగారా? గ్యాంధీగారి పేరు ఇనక పోడమేంది. ఆయనేగా [అంటూ గోడకు తగిలించివున్న గాంధీ ఫోటోను చూపిస్తాడు.]

సుభాన్: ఊఁ ఆయనే. ఆ సంఘానికి నాయకుడాయనగారే.

దాదా : ఇట్టాంటి పెద్దలుండగానే ఇంతంత ఘోరాలు చేస్తున్నారు.

వీరా : ఎందుకు జేయరు? పటేల్లాంటివాళ్ళు కూడా ఈ రాజులతో, నవాబులతో రాజీ పడుతూ ఉంటే?

యల్లి : ఏందీ పటేలా? ఏ పటేల్?

కమల: సర్దార్ పటేల్.

యల్లి : ఓసోసి! అయితే ఆయన ఈ పటేళ్ళందరి తలదన్ని నోడన్న మాట!

సుభాన్: అదిగాదు యల్లిమందా, ఆయన మన పటేళ్ళాంటివాడు గాదు! పెద్ద కాంగ్రెసు నాయకుడు.

యల్లి : ఎంత కాంగిరేసు అయితే మట్టుకి ఈ పటేళ్ళ నెట్టా నమ్మతా వయ్యా? మీరు లచ్చజెప్పండి. నేను మట్టుకి పటేల్ నేపస్తే నమ్మను.

వీరా : (నవ్వుతూ) సరే ఇప్పుడు నీకు తెలియదులే ఈగొడవ. పోనీ దీన్ని గురించి రేపు తీరికగా చెప్పుతానులే.

[మంగలి రాముడు ప్రవేశం]

వీరా : ఏమిటి రాముడూ ఇలా వచ్చావ్.

రామి : ఏం దొర పంపించాడా మమ్మల్ని తీసుకురమ్మని.

రాముడు: లేదు బాబూ!

కమల: మీ కోసం గాదులే. మళ్ళీ యల్లమందను తీసుకరమ్మని పంపించి ఉంటాడు.

యల్ల : ఆఁ నాకోసమే. ఇంకా నేను గడీ కెల్లకేం! (రాముడితో) ఏమైనా నరే నేను రాను పో అశ. చెప్పుకో పొయ్యి.
(అందరూ నవ్వుతూ వుంటారు)

వీరా : అనలు విషయి మేమిటో చెప్పనియ్ ఎందుకిప్పుడే తొందర పడడం?
దాదా : (రాముణ్ని జూచి) ఏమిటి పని?

[చెప్పడానికి రాముడు సందేహిస్తూ ఉంటాడు]

వీరా : సందేహిస్తా వెందుకు? చెప్పు.

రాముడు: ఏం లేదు బాబూ. నేను కూడా....[అందరి మొఖాలవైపు చూస్తూ ఉంటాడు.]

వీరా : చెప్పు ఫర్వాలేదులే చెప్పు.

రాముడు: నేను కూడా సంగం పడదామనుకున్నా దొరా!

దాదా : ఈ మాట చెప్పడానికే ఇంత భయపడతావేం?

రాముడు: ఈ సంగతి మల్లా దొరకు తెలిస్తే నిలువునా పాణం దీస్తాడు.

రామి : నీవు మా సంఘంలో ఎట్లా జేర్తావ్?

వీరా : అదేమిటి రామిరెడ్డీ ఎందుకు జేరగూడదు? అతను మాత్రం మన లాంటి బీదోడు గాదా?

సీత : అయితేం, దేశముఖు మనిషిగా?

వీరా : అలా అనుకుంటే మన మంతా ఎవరం? దేశముఖ్ మనుషులంగాదా? అతను దేశముఖ్ ఇంట్లో చాకిరి జేస్తున్నాడు. మనం బైట పొలం మీద పండించి వాడింట్లో బోస్తున్నాం. అంతే తేడా.

దాదా : బాగా పారజూస్తే అంతేలే ఏముంది తేడా?

యల్ల: ఈ మంగలాయన జేరతానంటే పట్టుకు దొర ఊరుకోవద్దూ.

సుభాన్; ఏమయ్యా రాములూ, బాగా ఆలోచించుకున్నావా? ముందు చాలా చిక్కులొస్తాయ్.

సీత : ఇంకా ఆలోచించుకునేదేముంది! ఈ సంగతి దొరకి తెలిస్తే నీ కాస్తి నౌకరీ ఊడిపోతుంది.

రాముడు: పోతేపోయిందిలే అమ్మా. నా పీడా వదులుద్ది. ఈ నౌకరీ ఉండిమట్టుకు నా కొరిగింసే దేముంది? పొద్దస్తమానం ఆయనింట్లో అరవశాకిరీ సేయడమేగా?

కమల: ఏం? మీ మంగళ్ళ కేదో కొంత మాన్యముంతాలిగా!

రాముడు: [విచారంగా] అదేవుంటే లేందేమిటమ్మా. ఎట్టో ఒకట్టా బతికే వాళ్ళం.

దాదా : ఆ మాన్యంకాస్తీ అప్పుడే లాక్కున్నాడుగా!

రాముడు: అయిదేళ్ళకింద ఎన్నడో నా పెళ్ళికి పాతిక రూపాలిచ్చిండు. వడ్డీతో వంద దాటిందనీ విరుడు ఆ కాస్తిగడ్డా లాక్కున్నాడు.

వీరా : ఇందులో ఆశ్చర్యమేముంది? ఇది మామూలుగా జరిగేదేగా?

దాదా : ఈ ఊళ్ళో పనిపాటలోళ్ళ మాన్యా లెవళ్ళయ్ మిగిలాయి?

యల్ల: మాన్నాలేనా? బంచరాయి కూడా నాదే అని లాక్కున్నాడుగా.

వీరా : తాతలనాటినుంచి కాపురముండే కొంపల్లోనుంచి లేవగొడితే దిక్కు లేదుగాని, ఇవి ఒక లెక్కా? వాములుదినే స్వాములకి పచ్చగడ్డి ప్రసాదం? ఇలాంటి వెన్ని లాక్కోందే వాడికి ఇరవై వేల ఎకరం అయింది?

సీత : సరే. పాపం, ముందా రాముణ్ణి సంగంలో జేర్చుకోండి.

వీరా : ఏం దాదా, చేర్చుకుందామా?

దాదా : నీ ఇష్టం నాయనా. ఆ మంచీ, చెడ్డా అంతా నీకే తెలుసు.

రామి : ఏంరా రాముడూ, సంగంలో జేర్చుకుంటే ఇక దివాణంలోకి పోకుండా ఉంటావా?

వీరా : ఏం పోతే?

రామి : ఏం పోతేనా? రెండావుల దూడలాగా అక్కడా, ఇక్కడా ఎట్ల కుదురుద్ది? ఉంటే సంగంలోనన్నా ఉండాలి; లేకపోతే దివాణంలోనన్నా ఉండాలి.

రాముడు: ఇదంతా ఎందుకు బాబు: అసలు మీరు పొమ్మన్నా నేనాడకుబోను.

సుభాన్: ఏం, ఎందుకని?

రాముడు; ఏంజెప్పను బాబు నా గోడు: కొడుకు బుట్టి ఏడాది అయింది. ఇంత వరకు వాణ్ణి ఎత్తుకొని ఎరగను.

సీత : అదేంటి రాముడూ. అట్టంటావ్!

రాముడు: ఏముంది తల్లే. కోడిగూసినప్పుడనగా లేసి సద్ది దాగి, గడీకిబోతా. ఆ పోయిన పోవటం మళ్ళీ నడిజాముకిగాని కొంపకు జేరను. ఇంకా వాణ్ణి నేనెత్తుకునే దెప్పుడమ్మా?

సీత : నిజమే పాపం, నీ వెళ్ళేటప్పటికి లేవడు: మళ్ళీ నీవు తిరిగి వచ్చే టప్పటికి నిద్రపోతావుంటాడు. అంతేనా?

రాముడు: అంతేనమ్మా, అంతే.

కమల: నడిజాందాకా అక్కడేం జేస్తావ్ రాముడూ?

రాముడు: ఒక పనా? ఎల్లినకాడనుంచి బారెడు పొద్దెక్కేదాకా పక్కలు తీయడం, మంచా లెత్తడం, ఆ లంకంత కొంప ఊడ్చి ఎత్తి పోయడం సరిబోద్ది. పగలు పొద్దాకా ఆయన సేవ జేయాలిగా? మల్లీ సందకసువూడవడం, కందిళ్ళు (లాంతర్లు) తుడవడం, మల్లీ పక్కలేసి ఆయన నిద్దరోయిందాకా గాళ్ళు బిసికి—అప్పుడు బయట

పడాలి. ఇంతజేసినా, ఏరోజూ కారోజు చీవాట్లూ, దెబ్బలూ తప్పవ్.

యల్ల : ఓసోసి. ఆదేజూత్తే, నీకంటె నేనే కాత్తి మెరుగన్న మాట!

రాముడు: నీకేమయ్యా, మారాజువి. ఎల్లిననాడు గొర్రెలకాడి కెల్తావ్, లేనినాడు ఆయిగా గొంగళి ముసుగెట్టి పండుతావ్.

యల్ల : టుర్ర్, కీ....

రామి : అదేంటి నీ దొంద!

యల్ల : లేకపోతే ఏంది? నేను మారాజునంట! మారాజుని. ఒకనాడు జీవా లెమ్మటెల్లిమను తెలుత్తుంది, పంగలాయన సంగతి.

[అంతా నవ్వుతారు]

సుభాన్: బీదోళ్ళ కష్టాల కేం తక్కువలే. కాస్తి కూస్తి తేడాకేం గానీ అందరి పనీ అలాగే వుంది.

వీరా : అవును. అందుకోసమే మన మందరం గలిసి సంఘం బెట్టుకుంది. మన సంఘం ఎంత త్వరగా బలపడితే అంత త్వరగా మన మీ కష్టాలనుంచి గట్టెక్కుతాం. సరే, రాముడూ! యిప్పుడు మేం మీటింగుకు పోనాత్నం గాని, రేపు ప్రొద్దున్నే రా! సంఘంలో చేరుదువుగాని.

రాముడు: సిత్తం దొరా, మీ బానిచోణ్ణి.

వీరా : అలా అనగూడదు. మన సంఘంలో దొరలూ—బానిసలూ అంటూ ఉండరు. అందరం సమానమే! అంతా అన్నతమ్ముల్లాగా వుండాలి.

రాముడు: సిత్తం దొరా? (నాలిక కొరుక్కుని) సిత్తం బాబూ! వత్తానండి.

[దండంబెట్టి వెళ్ళబోతూ ఉంటాడు]

వీరా : ఇదిగో రాముడూ? దివాణప్పనికి వెళుతూనే వుండు: ఎందుకయినా మంచిది.

రాముడు: అట్నేలే బాబూ! (నాలుగడుగు లేసి వెనక్కి తిరిగి మళ్ళీ, వీరారెడ్డి దగ్గిర కొచ్చి) ఈ సందట్లో అసలు మాట మర్చిపోయ్యా.

ఇయ్యాల దొరగారూ, పట్వారీ కలిసి కచ్చడప్పు బండ్లు కట్టుకొని నల్లగొండ బోయిన్రంట! ఆడనుంచి దొర పట్నం కూడా పోతడంట!

[అందరూ ఆలోచిస్తూ వుంటారు]

దాదా : ఎందు కెళ్ళినట్టబ్బా!

రాముడు: రాతిరి వాన పొద్దోయిందాకా ఇద్దరేందో గుసగుసలాడిన్రు.

సుభాన్: ఏమన్నా దొంగకేసులు పెడతాడేమో, మనమీద.

వీరా : (ఆలోచిస్తూ) సరే రాముడూ, నీవు పద! మరేం ఫర్వాలేదు.

(రాముడు దండంబెట్టి వెళ్ళిపోతాడు)

రామి : (రాముడు పోయిందాకా అతనివైపు చూస్తూ) ఏమో, వీణ్ణిక్కడికి జేరనివ్వడం నా కనుమానంగానే వుంది.

వీరా : ఏమిటి అనుమానం? అతన్ని సంఘంలో జేర్చుకోడం తప్పనా నీఉద్దేశం? అలాంటి బీదోళ్ళని జేర్చుకోకపోతే, ఇంకెవర్ని జేర్చుకుంటావ్. నీ కంటె, నాకంటే అతనికేం తక్కువ కష్టాలులేవు.

రామి : ఎన్ని జెప్పినా అతను దివాణప్పురుగు. ఇక్కడ సంగతులన్నీ మూటగట్టుకెళ్ళి అక్కడ జెప్పితే....

సుభాన్: ఏం చేస్తే, మన కేం భయం? మన మేమన్నా, దొంగేడ్పు ఏడుస్తున్నామా? చేయదల్చుకున్నదేదో బండ పగలగొట్టినట్లు మనం బజార్లోనే చెప్పి చేస్తున్నాం.

దాదా : అట్టాంటి బీదోణ్నికూడా అనుమానిస్తే మన సంఘం ఎట్టా బలపడతది రామిరెడ్డీ. కాకపోతే నాలుగు రోజులు కాస్త కనిపెట్టి ఉందాం.

సీత : ఎంత దివాణంలో ఉన్నా, మొదటినుంచీ రాముడు కాస్తి మెత్తని మంచా కొడుకే. అంత మోసం చేస్తాడనుకోను.

కమల: చేస్తే ఒకరోజు చేస్తాడు, రెండురోజులు చేస్తాడు, తర్వాత ఎక్కడికి పోతాడు?

యల్ల : ఏడకి బోతడు. అంతేలే బుల్లెమ్మా, మేక అయిందీ, మెకం అయిందీ నాలుగడుగు లేసేటప్పటికి అదే తేలుద్ది. పదండి పోదాం మీటింగుకి.

వీరా : సరే పదండి పోదాం. దోలో ఆంధ్ర మహాసభకీ జై!

లేవండోయ్ లేవండోయ్
కార్మిక కర్షక యోధుల్లారా ॥రా రండోయ్॥

దారుణ హింసాకాండను ధీకొని
పోరాడా లిదె రణరంగానికి ॥రా రండోయ్॥

పేదల రక్తము పీల్చు దేశముఖు
పిశాచి పాలన నశింపజేయగ ॥రా రండోయ్॥

స్త్రీలను చెరచీ శిశువుల జంపే
కాలకింకరుల కాలరాయగా ॥రా రండోయ్॥

ప్రజలకు హక్కులు లేని ప్రభుత్వం
ప్రభుత్వమా అది పశు ప్రభుత్వం
స్వాతంత్ర్యము మన జన్మహక్కని
జయభేరి మ్రోగించ పదండోయ్ ॥రా రండోయ్॥

ఆరు

# 4

## దివాణం (గడీ)

[దేశముఖు, అతని వెనుక పట్వారీ ప్రవేశం]

జగ : చూడవయ్యా చూడు. పదిరోజుల్లో ఒక్కొక్కణ్ణి చీల్చి ఎండేస్తానో లేదో! పూటకూటికి గతిలేని ఈ వెధవలు నన్నా ఎదురించేది?

వెంక : (నవ్వి) అంతేలెండి. గొర్రె కొవ్వి కొండమీద తిరగబడిందట! అలా వుంది వీళ్ళ పని.

జగ : హ్హాఁ. ఏమిటనుకున్నారో, దేశముఖు జగన్నాధరెడ్డి అంటే.

వెంక : మీ సంగతి ఆ కూపస్థ మండూకాలకేం తెలును! ఆవులించితే మీరు పేవులు లెక్కబెట్టరూ? మీరు పట్నం బయలుదేరగానే అనుకున్నా, "దొరవారికి కోపం వచ్చింది, ఇక ఈ దెబ్బతో ఈ గొడవలంతా నల్లుల్లాగా మాడిపోవాలసిందే" అని.

జగ : అనుకోవడమేమిటయ్యా, ఇంకా మన కత్తి కెదురుకత్తి ఉందా?

వెంక : ఎలాగైనా....మన ప్రభువు........

జగ : ప్రభువు! (వికారంగా నవ్వి) మనం లేకపోతే ప్రభువెక్కడుంటా డయ్యా, సాయిబైతే మాత్రం సర్ మీర్జా ఇస్మాయిల్‌ని చెప్పుకోవాలి గాని.

వెంక : అదో ఆయనెక్కడ యుగంధరుడు.

జగ : కాకపోతే ఏమిటి మరి. ఎక్కడ వేయాలిసిన పాచిక అక్కడే వేస్తున్నాడు. చూడు, అటు వైస్రాయి దగ్గర కెళ్ళి నీ అంత మొనగాడు లేడనిపించుకుంటున్నాడు. ఇటు కాంగ్రెస్ వాళ్ళ దగ్గిరికెళ్ళి కాంగ్రెసోడనిపించుకుంటున్నాడు.

వెంక: అనిపించుకోవడమేమిటి? 'డాక్టరు పట్టాభి శీతారామయ్య పంతులుగారి పత్రిక జన్మభూమి కూడా ఆయన్ని కాంగ్రెసు వాడే అని వ్రాసింది.

జగ : ఒహో, అలాగా! ఇంకా నాకా సంగతి తెలిదే, ఏమి ప్రజ్ఞయ్యా. అలా ఇంకెన్ని పత్రికల నోళ్ళు గట్టాడో!

వెంక : అసలు ఆయనకి వ్యతిరేకంగా నోరు తెరచిన పత్రిక ఒక్కటుందా?

జగ : పత్రికలమాట సరేనా. ఇలాంటి వెధవలందర్నీ కేసులు పెట్టి శిక్షించమని హైకోర్టు, కింది కోర్టులకు ఒక రహస్య సర్క్యులరు కూడా పంపింది. ప్రపంచంలో ఏ మంత్రి చేయించగలిగాడయ్యా ఇంత గొప్ప పని?

వెంక: నిజమే మంచి ప్లానే వేశాడు. కాని ఏం లాభం: ఆదేదో పత్రిక ఆ రహస్యం కాస్తా బైట బెట్టిందిగా!

జగ : ఏడ్చింది! మంత్రాలకు చింతకాయలు రాలుకేం? జరిగే పనేదో జరుగుతూనే ఉంది, ట్రైనింగు తీసుకునేవాళ్ళు తీసుకుంటూనే ఉన్నారు. ఊళ్ళమీద దాడి జేసేవాళ్ళు చేస్తూనే ఉన్నారు. హైదరాబాద్‌లో చివరికి నిజాం సాగర్‌లో కూడా విమానాశ్రయం నిర్మిస్తున్నారు.

వెంక: (ఆశ్చర్యంగా) నిజాం సాగర్‌లోనా! చెరువులోనా విమానాశ్రయం?

జగ : ఆఁ చెరువులో విమానాశ్రయం. ఇంగ్లండులో లేచిన విమానాలు ఎకా ఎకీ వచ్చి ఇక నిజాంసాగర్‌లో వాలడమే. ఏమనుకున్నావ్ మరి మీర్జా ఇస్మాయిల్ దెబ్బంటే!

వెంక : మొన్న అకిన్‌లెక్ కూడా మన హైదరాబాద్ వచ్చాడటగా!

జగ : వచ్చాడు. వేయాలిసిన ప్లానేదో వేశాడు. ఇక మనకేం లెక్క. కానివ్వవయ్యా మన తరఫున లక్ష నైజాం సైన్యం ఉంది. ఇంకా కావలసి వస్తే అంగ్రేజ్ సర్కారు విమానాలు, టాంకులు కూడా పంపిస్తుంది. ఇక వీళ్ళూ, వీళ్ళ సంఘాలు ఈ దెబ్బతో మసి మసి.

వెంక : అసలు అంగ్రేజీ (బ్రిటిష్)లో ఉన్న సంఘాలు కూడా పోతే గాని మనకి పీడ పూర్తిగా వదలదు.

జగ : ఇంకా సంఘాలేమిటి? అసలు బ్రిటిష్ ఆంధ్రే మన నవాబుగారి చేతుల్లోకి వస్తూ ఉంటే.

[మస్తాన్ ప్రవేశించి సలాంజేసి ఒక ప్రక్కన ఒదిగి నుంచుంటాడు. అతని ముఖంలో విచారభావం వ్యక్తమవుతూ వుంటుంది.]

వెంక : ఏఁ మస్తాన్ అలా వున్నావ్?

మస్తాన్: ఏం చెప్పను, పొద్దుటినుంచి ఊరుచుట్టూ, గూడెం చుట్టూ, తిరిగి తిరిగి నా దుంప తెగింది.

వెంక : ఏం?

మస్తాన్: ఏముంది ఇయ్యాల ఒక్క జీతగాడూ రాలా.

జగ : (గుడ్లురుముతూ) ఆఁ అంత పొగరు దిగిందా?

వెంక : ముందు సేత్‌సింధీని (మోతాదు) బంపి వాళ్ళందర్నీ పిల్చుకరమ్మను.

జగ : ఊఁ వెళ్ళు. ఇవ్వాళ ఒక్కొక్కణ్ణి డొక్క జీల్చేస్తాను.

మస్తాన్: ఇంకా సేత్‌సింధీ ఎక్కడ బాబూ, వాడిందరి కంటె ముందే ఎగగొట్టాడు.

వెంక : అయితే ఊరూ, గూడెం ఏకమయిందన్న మాట.

మస్తాన్: ఎక్కడ గొడ్లు అక్కడే వున్నాయి. చివరికి వాటిదగ్గర పేడ తీసే దిక్కు కూడా లేదు.

వెంక : (దేశముఖు వైపు చూచి) ఎంతపని చేశారు, గాడిదలు. మన ఇద్దర్నీ ఊళ్ళో లేకుండి జూసి.

మస్తాన్: మీ ఇద్దరూ ఊళ్ళో లేకపోవడం వల్లనే వాళ్ళకింత కొమ్ము లొచ్చాయి. రాములవారి గుడిదగ్గర పెద్ద మీటింగు కూడా జేశారు.

జగ : మీటింగే! నా వూళ్ళో! నా రామ మందిరం ముందు? మరి నీవెక్కడేడ్చావ్!

మస్తాన్: ఏం జేస్తాను ఊరూ నాడూ ఏకమైతే? వాళ్ళ ముందిప్పుడు నాబోటోడు మాట్లాడేటట్టుందా? ఆయనెవరో, ఒకాయన వచ్చాడు. జిల్లా నాయకుడంట — జిల్లా నాయకుడు? తెగ వదిరాడు. అప్పటికీ కోపం పట్టలేక మన ముఠాచేత మీటింగు మీద రాళ్ళు వేయించా.

వెంక : భలేపని చేశావ్, కుక్కకాటుకు చెప్పుదెబ్బ. సరిపోయింది.

మస్తాన్: సరిపోయేదే, కాని....

జగ : కాని—

మస్తాన్: దొంగ గాడిద కొడుకులు, కాపలాగాసి మనాళ్ళందర్నీ పట్టుకు కొట్టారు.

వెంక : కొట్టటమే!

మస్తాన్: కొట్టడమేమిటి? మరీ మన ఓనమాలు వెంకన్నని చావచితక బొడిచారనుకోండి. మీటింగులో లేచి నుంచోని అంతా ప్రమాణం కూడా జేశారు. దేశముఖు పెత్తనం నాశనం జేసిందాకా విద్ర బోరట!

జగ : ఏమిటి! ప్రమాణాల వరకూ వచ్చిందీ. చూస్తాను వాళ్ళ నాశనమో నా నాశనమో తేలిపోవాలి.

[ఒక పోలీసు ప్రవేశించి సలాంచేసి నుంచుంటాడు.]

వెంక : అమీన్‌సాబ్‌గారు వచ్చేశారా ఏమిటి?

పోలీస్: ఆఁ వస్తున్నారు మారాజ్.

జగ : పోలీసో?

పోలీస్: ఆఁ పోలీసుకూడా వస్తాఉంది మారాజ్.

వెంక : వస్తున్నారా? అచ్ఛా.

జగ : ఎవడురా అక్కడ?

[రాముడు ప్రవేశించి దణ్ణం బెట్టి నుంచుంటాడు]

జగ : ఏంరా, బంగాళా అంతా ఊడ్చి బాగుజేశావా?

రాముడు: ఆఁ చేసిన్ను దొరా.

జగ : (వెంకట్రావుతో) తయారు చేయవయ్యా జాబితా, అరే రాముడూ, ఆ జాబితా కోమటికిచ్చి కావలసిన వస్తువులన్నీ బంగళాకి పట్టుకెళ్ళు.

[పట్వారీ వెంకట్రావు జాబితా తయారు చేస్తూ ఉంటాడు.]

జగ : ఏయ్ మస్తాన్, నీ వెళ్ళి గేటు దగ్గర నుంచో. అమీన్‌సాబ్ రాగానే నాకు కబురుచెయ్. (పోలీసుతో) రెండు ఏటలు సరిపోతయ్యా?

పోలీస్: పలావ్‌కి మా అందరికీ రెండెట్టా సరిపోతయ్ జనాబ్! కనీసం నాలుగయినా ఉండాలి.

జగ : సరే, పంపిస్తాను.

వెంక : అరేయ్ రాముడూ, ఇదిగో జాబితా పట్టుకెళ్ళు.

[కాగితం మడిచి రాముడి కివ్వబోతాడు]

పోలీ : ఏమేం రాశారు పట్వారీ సాబ్?

వెంక : మీకు కావలసినవి సమస్తం రాశాను. మషాళా దినుసులు, మిర్చి, చింతపండు, అల్లం, బెల్లం, వుప్పు, పప్పు, ఉల్లిగడ్డలు, వెల్లిగడ్డలు, బీడీలు, సిగరెట్లు—బియ్యం, నెయ్యి....

పోలీ : నెయ్యి ఎంత వేశారు?

వెంక: అరడబ్బా.

పోలీ : అరడబ్బా ఎట్టా జాస్తుంది, మారాజ్! ఒక డబ్బా అయినా లేకపోతే ఎట్టా?

జగ : (వెంకట్రావుతో) ఊఁ వెయ్యవయ్యా. డబ్బావెయ్! అరే రాముడూ! నీతోపాటు ఈ పోలీసుకూడా వస్తాడు గాని, ఆయనకి కావలసిన వన్నీ ఇప్పించేసెయ్.

రాముడు: సిత్తం దొరా! (జాబితా తీసుకొని దండం బెట్టి వెళ్ళి పోతాడు)

పోలీ : ఆదాబ్ అర్జ్! (సలాంజేసి వెళ్ళిపోతాడు.)

జగ : (అటూ ఇటూ పచార్లు గొడుతూ) నేటికి నా ఊళ్ళో పొరుగూరి వాడు వచ్చి, మీటింగు బెట్టడమా! సమయానికి నేను లేకపోతిని.

వెంక : మనమే ఉంటే ఊళ్ళో కాలుబెట్టి మళ్ళీ వాడు బైటికి పోతాడా? వంటింట్లో కొచ్చిన కుందేలు తప్పించుక పోయింది. ఇప్పుడేమను కుంటే ఏం లాభం?

జగ : చూస్తాను. ఈసారి యెలా తప్పించుక బోతాడో!

వెంక : అసలీ జిల్లాకు చిచ్చు బెట్టిందే ఆ వెధవ. ఒకసారి గట్టిగా దరువు పడితేకాని....

జగ : దరువూలేదు, గిరువూలేదు. ఈసారి దొరికితే బిస్మిల్లా చేయడమే. ఎన్ని వేలయితే మాత్ర మేం?

వెంక : ఆ ముండమోపికి వేలు గావాలా? మన వెంకన్ననీ, సుబ్బన్ననీ ఇంకా రెండుపావు లెక్క వేసుకోమంటే సరి! రేపీ పాటికి........

[మస్తాన్, అమీనుల ప్రవేశం]

జగ :
వెంక : } (లేచి నుంచొని) ఆదాబ్ అర్జ్ హై

అమీన్: ఆదాబ్ అర్జ్ హై

[దేశముఖు అమీన్ కెదురుగా వెళ్ళి, కరస్పర్శ జేసి తీసుకొచ్చి తన కుర్చీలో కూచోబెడతాడు. పక్కనున్న కుర్చీలో తాను కూచుంటాడు. పట్వారీ ఒక పక్కన, మస్తాన్ మరో పక్కన నుంచుంటారు.]

అమీన్: (కుర్చీలో కూర్చుంటూ) హేమ్టి మహరాజ్! నీ మీదా షికాయత్ వచ్చింది. మీకీ దివాణంలో చాలా చాలా గొడ్వా హుందట!

జగ : నా మీదనా షికాయత్! ఎవరా చేసింది?

అమీన్: హెవడూ హేమ్టి! హ్డికీ జనం హంతా దస్తఖత్ చేసి తాలూకా దార్కి హింత పొడ్గూ మహజర్ హొక్టి పంపాన్. రైతుల్‌మీద చాలా చాలా జులుం చేస్తున్నావూ హంట.

వెంక : సర్కారీ లెవీ ఇవ్వమని గట్టిగా అడగడం కూడా జులుమేనా? లెవీ ఇవ్వకుండా ఎగ్గొట్టి పైన దేశముఖ్‌గారి మీదనే రిపోర్టు చేశారన్న మాట! ఏముంది! మొగుణ్ణిగొట్టి మొర్రో అన్నట్లుంది ఇదంతా.

అమీన్: హరే లెవీ గివీ గొడ్వా మాకీ హేమి? హోళ్లా కొంపల్కి లూటీ చేయడం, హెద్దుల్కి తోల్కా పోవడం, హోళ్ళా పొలాల్కి మీకీ ఖబ్జా (వశం) చేసోక్కవడం గడీకి పిల్చి కొట్టడం హిదంతా జులుం గాకపోతే హేమ్టి అయ్యా.

వెంక : హుజూర్, ఇదంతా సంఘం వాళ్ళ మాయ. రంకు నేర్చిన అమ్మ బొంకకపోతే ఎట్లా?

[మస్తాన్ను సారా సీసా తీసుకు రమ్మని దేశముఖ్ సైగ జేస్తాడు]

జగ : (పట్వారీతో) అదేమిటయ్యా, వెంకట్రావుగారూ! సంఘం వాళ్ళ బద్మాషీ మన అమీన్‌సాబ్‌గారికి తెలియకుండా ఉందా?

వెంక : వారికి తెలియకపోవడమేమిటి? అసలు సవాబుగారే పోవాలని వాళ్ళు మీటింగులు పెడుతూఉంటే.

అమీన్: మీటింగు హెక్డా?

వెంక : ఎక్కడేమిటి! రాత్రి ఈ ఊళ్ళోనే మీటింగు బెట్టారు.

అమీన్: అరే. మాది ఇజాజత్ (పర్మిషన్) లేకుండా హెట్టా బెట్టారూ?

జగ : వాళ్ళ పని ఇప్పుడు మీరూ మేమూ కనబడేటట్టుందా?

వెంక : కనబడేటట్టుంటే అమీన్ సాబ్‌గారంతటివాణ్ణి బట్టుకొని నిన్న మీటింగులో అలా ఎందుకు తిడతారు?

అమీన్: హేమ్టి? నాకీ తిట్టారా?

[మస్తాన్ సారాసీసా తీసుకొచ్చి టేబుల్‌మీద ఉంచుతాడు]

జగ : (గ్లాసులో సారా పోస్తూ) ఒక్క తిట్టడమేనా! మిమ్మల్ని, మమ్మల్ని నాశనం జేసిందాకా వాళ్ళు నిద్రబోరట!

[గ్లాసు అమీన్ చేతికిస్తాడు]

అమీన్: (గ్లాసు తీసుకుంటూ) అరే బద్మాష్. (ఒక్క గుక్క తాగి) మీకి పటేల్కి ఉండీ ఎందుక్కి జరగనిచ్చావ్ మీటింగ్?

మస్తాన్: ఏం జేస్తాం హుజూర్, మీటింగ్ ఆపమని దొరవారు పంపితే వెళ్ళాం. చూడండి ఏం జరిగిందో. (వీపు చూపెడతాడు)

అమీన్: అరే బాప్‌రే! (గ్లాసు కింద బెడుతూ) హెవడూ ఆ సువ్వర్ నీకీ కొట్టింది.

వెంక : ఇంకెవరు కొడతారు! సంఘంవాళ్ళే. ఎంత ఘోరం చూడండి. ఆ దెబ్బలు చూడండి.

అమీన్: హిక్డా హెంత జనం హుంది షంగంలో.

వెంక : మస్తాన్ బోటి బుద్ధిమంతులు ఎవళ్ళో పదిమంది దప్ప అంతా సంఘంలోనే చచ్చారనుకోండి.

అమీన్: (సిగరెట్టు ముట్టిస్తూ) అరే? ఊర్‌కీ ఊర్ హంతా షంఘంలో చేరిందీ?

వెంక : రౌడీముండాకొడుకులంతా జేరి చంపుతాం, పొడుస్తాం అని బెదిరిస్తే ఈ పిచ్చి మూకంతా జేరింది.

అమీన్: హంతా జులుం చేశార్గా.

వెంక : నేను చెప్పడమెందుకు. చూడండి, మీరే స్వయంగా చూడండి. (దస్త్రం విప్పుతూ) పాపం ఆ గొల్లముండా కొడుకొచ్చి లబ్బున ఏడ్చాడు. (యల్లమంద కాగితం తీసి అమీన్ చేతికిస్తాడు)

అమీన్: (చదివి) అచ్ఛా బులావో. హెల్మందాకో, హిస్పే దర్యాప్తు చేయ్‌వాలి.

జగ : మస్తాన్. ఊఁ వెళ్ళి యల్లమందను బిల్చుకురా.

వెంక : మీ బోటివారు పూనుకోవాలేగాని, ఈ కుక్క గొడుగు సంఘాలెంత సేపు (చిటికేస్తూ) ఇట్టంటే ఎగిరిపోవూ!

అమీన్: హంతా తేల్కా కాదూ పట్వారీసాబ్! హిప్పూ హెక్డా జూసినా హిదే గొడ్వా. రోజురోజూ సచ్చిపోతండాం తిగ్గాలేక.

జగ : ఇలాంటి వెధవల్ని పైకెక్కనిస్తే మీకూ చిక్కే, మాకూ చిక్కే. ఈ దెబ్బతో ఒక్కొక్కడి తల దిమ్మ వదిలించండి.

వెంక : మన అమీన్‌సాబ్‌గారి కిదొక లెక్కా! పెద్ద పెద్ద కొమ్ములు దిరిగిన హేమా హేమిల్నే చితక గొట్టారు.

అమీన్: హది కాదయ్యా, హిదీ షంఘంతో మాకీ పెద్ద పేచీ వచ్చిందీ. మాదీ పోలీస్ మీదా కూడా సదర్ నాజంకీ షికాయత్ (కంప్లెయింట్) చేస్తండార్. పేపర్ నిండా మాకీ బద్‌నామ్ చేసి వేస్తండార్. హీళ్కి జోల్కిపోతే మాకీ కష్టం తెచ్చీ పెడ్తార్.

జగ : ఈ పీనుగులు మిమ్మల్ని చేయ గలిగిందేమిటి? గుడ్డి కన్ను మూస్తే ఎంత, తెరిస్తే ఎంత? ఇదిగో మీ కట్నం తీసుకోండి. (జేబులోనుంచి నాలుగువేల రూపాయల నోట్లు తీసిఇస్తూ) ఊఁ కానియ్యండి, మీదెబ్బ కెదురేమిటి?

అమీన్: వద్దూ, మారాజ్ వద్దూ, హిదీ మాకీ పాణం మీద్కి వస్తాది.

జగ : మీ ప్రాణం మీదకా! ఏడ్చారు. అందాకా వస్తే ఇంకా మేం ఉండి ఎందుకు? నాలుగువేలు కాకపోతే పదివేలయితే మాత్రం ఈ సంఘాన్ని నాశనం చేయకుండా వదిలిపెడ్తానా?

వెంక : మా దొరవారు మాటంటే వెనక్కి తిరిగే మనిషా? మన సర్కారే పోయాక, ఇంకా మనం ఉండి ఎందుకు?

జగ : అమీన్‌సాబ్! అందాకావస్తే మీ ప్రాణానికి నా ప్రాణం. సందేహిస్తారేమిటి? ఉఁ తీసుకోండి (మరో నాలుగు వేలు తీసి ఇస్తాడు)

అమీన్: అచ్చా. అసల్ సర్కారీకి పోయేటట్లూ వుంటే మన్కీ హుండి హెందుకూ! (పైకం తీసుకొని జేబులో వేసుకుంటూ) చూస్తాన్ హీళ్కి తడాఖా. ఈ హూళ్ళో హెంతామంది ముసల్మాన్ లుండార్?

వెంక : ఎందుకు లేరు. వాళ్ళూ ఇరవై కుటుంబాల వాళ్ళున్నారు.

అమీన్: హోళ్కి మీకీ తరఫ్ హుండార్?

వెంక : లేరు సర్కార్. వాళ్ళకూడా సంఘంలోనే చేరారు.

అమీన్: అరే. హోళ్కి బుద్ధీలేదూ! కాఫిర్ (మహమ్మదీయేతర) షంగంలో హెట్టా చేరార్, మాదీ నవాబీకి వర్లీ పెట్టి.

[మస్తాను ప్రవేశం]

వెంక : వాళ్ళందరికీ పెద్ద ఈ మస్తాను తమ్ముడు సుభానేనండి.

అమీన్: క్యారే. నీదీ తమ్ముడూ నీకీ వర్లీ షంగంలోకీ పొయ్యాడ్?

మస్తాన్: ఏం జేస్తాను సర్కార్. నెత్తిన నోరు బెట్టుకుని ఎన్నాళ్ళు జెప్పినా వినందే.

అమీన్: అరే నాలాయఖ్. సుభానుకో బులావో. నాకీ చెప్పీ చూస్తా. అచ్చా, హెల్కుందా హేడీ?

మస్తాన్: ఎక్కడో వచ్చాడు. ఇంటి దగ్గర లేడండీ!

వెంక : సరే, నీవెళ్ళి ముందు సుభానుని, దాదాసాయబుని పిల్చిరా. (మస్తాను అమీనుకు సలాంజేసి వెళ్ళిపోతాడు) సుభానుని తిప్పడానికి మేమూ ఎంతో ప్రయత్నించామండీ! కాని లాభం లేక పోయింది. అతను చాలా పెంకెమనిషి.

అమీన్: మీకీ చెప్తే హెందుక్కా హింటావ్ చూడు, హిప్డు నాకీ పాంచ్ మినిట్ లో మార్చివేస్తాను.

[పోలీసు, మంగలి రాముడూ ప్రవేశం]

[అమీనును చూచి శాల్యూట్ జేసి పోలీసు అటెన్షను ఫోజులో నుంచుంటాడు.]

వెంక : (పోలీసుతో) ఏం మీకు కావాలిసిన సామాగ్రి అంతా దొరికిందా?

రాముడు: ముందు డబ్బియ్యందే కోమటాయన ఇయ్యనన్నడు దొరా!

జగ : (కోపంగా) ఆఁ ఏమిటి?

అమీన్: (పోలీసుతో క్యారే బేవఖూఫ్ హాడ్కీ జుట్టూపట్టి హిక్డా హీడ్చుక రాకా, హిట్టా సచ్చావ్ బే.

పోలీ : ఏం జేస్తాను హుజూర్? వాడికి కుమ్మక్కుగా బడితలు పుచ్చుకొని పదిమంది జనం వచ్చిపడ్డారు.

వెంక : చూశారా. చివరికి బఖాల్ కూడా ఓ పోలీసు కెదురు తిరిగాడు. ఇలా వుంది వీళ్ళ పని.

అమీన్: పోవయ్యా, ఓరూ హాక్లీ హాల్సా యిచ్చార్, లేకపోతే హాక్లీ హింత ఖలేజా·

పోలీ : (దేశముఖ్ తో) ఇయ్యకపోతే ఇయ్యకపోగా పైన ఎంతెంత మాట లన్నాడు!

జగ : అంటాడంటాడు. ఎందు కనడు? ఇవ్వాళ వాడికి చావు మూడింది. అరే రాముడూ, ముందు పోలీసులందరికీ దివాణంలోనే వంట చేయ మని చెప్పు.

రాముడు: సిత్తం దొరా. (వెళ్ళిపోతాడు)

వెంక : ఈ బకాల్ ఎక్కడికి పోతాడో చూద్దాం, ఇంత కింత వీడి దగ్గర పదింతలు కక్కిస్తాం.

అమీన్: హసల్ హిక్డా షంగం పెద్దా హెవడూ?

జగ : ఉన్నాడులెండి, ఒక పచ్చి రౌడీ, వీరారెడ్డి.

అమీన్: క్యా రెడ్డీ? మీదీ రెడ్డి మీకీ హెదురు తిర్గాద్ అరే! తోబా తోబా!

జగ : వాణ్ని రెడ్డి అనడం కూడా సిగ్గుచేటు.

వెంక : ఈ మధ్య మాదిగ కొంపల్లోకూడ కూడు తిన్నాడట దౌర్భాగ్యుడు!

అమీన్: హెకా తింటే హేమ్టి, హదీ మన్కీ హెందుక్కయ్యా. హాడ్కి పిల్చి రెండు మంచి మాటల్ సేసీ జేబ్‌లో పెట్కో.

వెంక : అతను అంతమాత్రానికి లొంగే పిండం కాదులెండి.

అమీన్: హేమి సేతాగానీ మాటా సేస్తావయ్యా, హంత్కి కాకపోతే పదీ హెకరాల్ హాడ్కి హిస్తే సరీ, హేమీ సేస్తాడయ్యా మీదీ మాటా హిన్కా? హప్పట్కి హీన్కాపోతే నాకీ హుంండాన్. హాడ్కి హుంండాడ్.

వెంక : చిత్తం అలాగే తమరు సెలవిచ్చినట్టే చేస్తాం.

జగ : ఎవడురా అక్కడ (రాముడు ప్రవేశం) అరేయ్, అమీన్‌సాబ్‌గారు రమ్మంటున్నారని వీరారెడ్డిని పిల్చిరా.

రాముడు: చిత్తం దొరా (వెళ్ళిపోతాడు)

[మరోవైపునుంచి మస్తాన్ ప్రవేశం]

జగ : ఏం వచ్చారా?

మస్తాన్: వచ్చారు మహరాజ్!

వెంక : లోపలికి రమ్మను (మస్తాన్ బైటికి వెళతాడు) — (అమీన్‌తో) మేంకూడా ఉండడం మంచిది కాదనుకుంటాను.

జగ : వెళతాం. వాళ్ళతో మీరొక్కరే మాట్లాడండి.

అమీన్: అచ్ఛా! అచ్ఛా!

[జగన్నాథరెడ్డి, వెంకట్రావులు వెళ్ళిపోతారు. అమీన్ సిగరెట్టు ముట్టించి పీలుస్తూ ఉంటాడు. మస్తాన్‌తోపాటు దాదా, సుభానుల ప్రవేశం.]

అమీన్: (బెంచ్ చూపిస్తూ) ఆవ్ భాయి ఆవ్. బైఠో.

దాదా : ఎందుకులెండి ఇక్కడే నుంచుంటాం.

అమీన్: అరే మీకీ మాకీ తేడా హేఁహ్టి! మందీ మతంలో హంతా హొక్టే బైఠో.

దాదా : ఎట్టా గైనా మీరు మహరాజులు. మాదేముందిలెండి బిక్కాపకీర్లం

సుభాన్: ఇంతవరకెప్పుడూ ఇక్కడ కూర్చొవి ఎరగం. కొత్తగా ఇవ్వాళెందుకు లెండి. మమ్మల్ని పిలిచారట ఎందుకు?

అమీన్: మీకీకూడా షంగంలో చేరార్గాదూ?

సుభాన్: ఆఁ చేరాం.

అమీన్: అరే! మీకీ కాఃఫిర్లా (హిందూ) షంగంలో సేరార్! నాకీ హెక్తా చూడలా. హిది హేఁహ్టి భాయీ, క్యాదాదా. నీకీకూడా షంగంలో చేరావ్?

మస్తాన్: ఏదో తెలవక చేరారు లెండి.

సుభాన్: తెలిసే చేరాం. ఇది కాఫిర్ల సంఘం కాదు. బీదోళ్ల సంఘం!

అమీన్: బీదోళ్ళాషంగం! (వెకిలినవ్వు నవ్వి) అరే దీవానా నీకీ హేఁహ్టి తెల్సు, హిందువుల్కీ చేసే కిలాడి.

దాదా : ఇక్కడ అదంతా ఏమి లేదులెండి! అంతా కలిసే ఉంటాం.

సుభాన్: ఇందులో హిందువులు చేసే కిలాడి ఏముంది?

అమీన్: కిలాడి గాకపోతే హేఁహ్టి మన అసఫ్ జాహీ సర్కార్ కీ బోల్తా కొట్టించే హంద్ఝూ హోళ్కీ షంగం పెట్టార్. మీరుపోయి బరాబర్ హోళ్కీ ధోఖాలో బడ్డార్.

సుభాన్: పైనుంది ఆజంషహీ సర్కారో, అంగ్రేజ్ సర్కారో, మా కంటికి కనపడేది మాత్రం ఈ దేశముఖు సర్కారే.

అమీన్: అరే, ఈ దేశముఖుదీ హేఁహ్టి హుందోయ్? హీళ్ళా హందర్కీ పైనా మందీ నవాబ్ హుండాడ్. హీళ్ళు హంతా హోయనా హెట్టాసెప్తె హట్టా సేయ్‌వాలి.

దాదా : అయితే ఈ జరిగే జులుం అంతా ఆయనగారే చేయమన్నాడా ఏమిటండీ?

సుభాన్: అవును. ఇదంతా ఆయనగారి చలవే.

అమీన్: అరే హేస్టి హట్టా అంటావ్. మంచీ నవాబ్ లేకాపోతే నీకి హెక్డా హుండేవాడవ్?

సుభాన్: ఎక్కడుంటాం ఇక్కడే ఉంటాం. ఈయన ఉండి మా కొరి గించిం దేముంది? ఈయన లేకపోతే మాకు పోయేదేముంది? గోచీకి మించిన దరిద్రం ఏమిటి?

అమీన్: అరే! మంచీ రాజ్యం. రాజ్యంచేసే జాతి. హేస్టి బానిసా మాటా సేస్తావ్.

దాదా : ఏమి రాజ్యమో? ఏమి రాజులమో?

సుభాన్: రాజులం! (చినిగిన చొక్కా చూపిస్తూ) కనపడతానే ఉందిగా దాదా, మన రాజుల దర్జా!

అమీన్: క్యారే? నీకీ మతం మట్టీ లేదూ హేస్టి?

మస్తాన్: కాఫిర్ల దోస్తీబట్టి తిరిగేవాడికి ఇంకా మతమేమిటి? మట్టేమిటి?

దాదా : గుడ్డొచ్చి పిల్ల నెక్కిరించినట్లు నీవు కూడా మాకు వంకబెట్ట బోతున్నావా? నీ జీవితంలో అస లెప్పుడన్నా నీవు నమాజ్ జేసి ఎరుగుదువ్?

సుభాన్: (నవ్వుతూ) ఆయన జేయకపోవడమేం దాదా? నీవు రోజు కయిదు సార్లు అల్లాకి సలాంజేస్తే, ఆయన రోజుకి యాభైసార్లు సలాం కొడతాడు.

దాదా : ఎవరికి?

సుభాన్: ఎవరికా? దేశముఖు జగన్నాథ రెడ్డిగారికి.

అమీన్: క్యారే గంవార్, నీకీ మర్యాదా. మంచి హేమిలేదు.

సుభాన్: పేదముండాకొడుకులకి మాకీ మర్యాద లెందుకు లెండి, కడుపులోకి కాస్త మేతబడితే చాలు.

అమీన్: ఏయ్ సుభాన్ నీదీ మంచికోరి చెప్తన్నా హినోక్క. మీకీ షంగం కావాలంటే మందీ వేరే షంగం హుంది. హందులో మీకీ చేస్తే మంచీ హుంటాది.

దాదా : ఏమిటి బాబూ ఆ సంగం?

అమీన్: మజలిసే ఇత్తి హదుల్ మునల్మిన్.

దాదా : ఎక్కడుంది అది? మే మెప్పుడూ దాని పేరన్నా వినలేదే?

సుభాన్: ఉందిలే దాదా ఒకటి, జాగీర్దార్ల సంఘం.

అమీన్: అరే జాగీర్దార్ హేస్టి, ముసల్మాన్లంతా హందులో కల్వవచ్చు.

సుభాన్: దేనికి? జాగీర్దార్ల నౌకరీ చేయడానికా? ఇప్పటికీ దేశముఖుల తోనే చచ్చిపోతున్నాం. ఇంకా జాగీర్దార్ల కొలువెందుకు లెండి.

అమీన్: మన్కీ ముసల్మానుల్కీ హిట్లా హుండాం కాబట్టే బీహారులో హిందువుల్ మన్కీ సఫా సఫా జేస్తుండార్.

సుభాన్: బెంగాల్లో మనవాళ్ళు చేసిందదేగా? బీహార్లో, బెంగాల్లో, పంజాబ్లో - ఎక్కడ చచ్చినా చివరికి మాబోటి పేదాళ్లేగా?

అమీన్: హైతే హింత్కీ మీరు ఆ కాఫిర్లా షంగంలోనే హుంటార్?

సుభాన్: కాఫిర్ల మీద నిజంగా కంత కోపమే వుంటే యీ దేశముఖు ఇంట్లో ఎందుకు మకాం బెట్టారండి! ఆయన మట్టుకు కాఫిర్ గాదా? ముసల్మానా?

అమీన్: (కోపంతో బల్ల గుద్ది కండ్లురుముతూ) అరే గధా (గాడిదా) నీకీ ఫకీర్కీ హుండావ్. ఆయన్కీ మహరాజ్కీ వంకా బెట్టావ్.

సుభాన్: చూస్తున్నావా దాదా. మత మేదయితే ఏం? చివరికి ఫకీర్లు ఫకీర్లే, దొరలు దొరలే.

దాదా : పద! ఇక్కడి కొచ్చి పైగా మాటలు పడడం ఎందుకు?

(ఇద్దరూ వెళ్ళిబోతారు.)

అమీన్: (లేచి) ఏయ్ బూఢా, ముసల్మానికీ పుట్కా పుట్టార్ గాబట్టి మీకీ వస్లీ పెడ్తంతా. హిప్పట్కి హైనా బుగ్గిగ్గి బత్కండి. మళ్ళీ మళ్ళీ చెప్తంతా.

[దాదా, సుభానులు వెళ్ళిపోతారు. అమీన్ మళ్ళీ ఒక దోసువేస్తూ వుంటాడు.]

మస్తాన్: అసలు చేసిందంతా ఈ ముసలాడే. చూడండి పైకి ఎంత పిల్లిలాగా కనబడతాడో!

అమీన్: హాక్టి దెబ్బాకీ హంతా వదుల్తాది. హీడ్కి గోరీ కట్టిచ్కాపోతే చూడు నాదీ దెబ్బ!

[దేశముఖు, పట్వారీల ప్రవేశం]

జగ : క్యా అమీన్ సాబ్, దారికొచ్చారా?

అమీన్: హాళ్కి షంగం పిచ్చి బాగా తల్కి పట్టింది. ఖాలీమాటల్కి సేస్తే హింటార్?

జగ : ఇవ్వాళ మాటలతో వినకపోతే రేపు లాఠీలతో వింటారు సరే! మీరు వచ్చి చాలా సేపయింది, కొంచెం విశ్రాంతి తీసుకోండి (రాముడు వచ్చి నుంచుంటాడు.) ఆ వచ్చేవాడి వ్యవహారం నేను చూస్తాను.

అమీన్: అచ్ఛా అచ్ఛా నాకీ హెళ్ళి ఆరాం సేస్తా. మీదీ మాటా హినాక్పోతే నాకీ ఖబర్ చెయ్.

[మస్తాన్ దారి జూపుతూ వుంటాడు, అమీన్ వెళ్ళిపోతాడు.]

వెంక : ఏంరా! అతను వచ్చాడా?

రాముడు: ఆ వచ్చిన్రు అయ్యగారూ.

వెంక : సరే తీసుకురా (దేశముఖ్ కుర్చీమీద, వెంకట్రావ్ బల్లమీద కూర్చుంటూ ఉంటారు.)

[రాముడు వెళ్ళి మళ్ళీ వీరారెడ్డితో ప్రవేశిస్తాడు.]

జగ : అరే రాముడూ వెళ్ళు, నీవు నీ పని జూసుకో.

[దణ్ణం పెట్టిరాముడు వెళ్ళిపోతాడు.]

జగ : (నవ్వు మొఖంతో లేచి వీరారెడ్డి దగ్గరకెళ్ళి) ఏమిటోయ్ వీరారెడ్డి! ఈ మధ్య నీకేదో ఉద్యోగం దొరికిందని విన్నానే నిజమేనా?

వీరా : నాకా ఉద్యోగం? అసలు నేనెప్పుడూ ప్రయత్నించలేదే.

జగ : అలాగా, (పట్వారీవైపు జూచి) ఏమిటయ్యా అలా అన్నావ్!

వెంక : ఈ మధ్య ఏదో ఆఫీసులో ఉన్నాడని మావాడన్నాడు లెండి.

వీరా :అవును. ఈమధ్య కొన్నాళ్ళు తాలూకా ఆంధ్ర సంఘం ఆఫీసులో ఉన్నాను. కాని అదేమీ ఉద్యోగం కాదే!

వెంక : (నవ్వుతూ) ఇంకేం! దాన్నిబట్టే మావాడలా అనుకున్నాడేమో లెండి.

జగ : ఎక్కడో తాలూకాలో బోయి పడుండడం ఎందుకోయ్ వీరారెడ్డి! కావాలంటే నేనివ్వనూ నీకిక్కడ ఉద్యోగం?

వీరా : నాకెందుకు? అసలు నేను ఉద్యోగం చేయదలుచుకోలేదు.

జగ : అది మంచిదేకాని, అసలు మన కులంలో చదువుకున్న వాళ్ళే తక్కువ. చదువుకున్న నీబోటోళ్ళు ఒకళ్ళూ, అరా యిలాగే అనుకుంటే ఇంకా మన వాళ్ళు ఎలా పైకి వస్తారు?

వెంక : ఏమిటయ్యా తెలిసిన వాడివి నీవుకూడా అలా మాట్లాడతావ్? ఎన్నాళ్ళు తంటాలు పడతావ్ ఆ నాలుగెకరాలతో.

వీరా : ఏదో మా అవస్థ మేం పడతాం లెండి.

జగ : (వీరారెడ్డి భుజంమీద చరుస్తూ) ఉద్యోగం లేకపోతే నీవేదో ఒక విధంగా బ్రతకలేవని కాదు, నేను చెప్పేది. నేనా ఒక్కణ్ణి. వ్యవహారాలేమో రోజురోజుకీ పెరిగి పోతున్నాయ్. ఎన్నని సర్దు కోను?

వీరా : అయితే నన్నేం చేయమంటారు?

జగ : మనలో చదువుకున్న వాడివి నీవుండగా నాకెందుకీ ఖాసంతా.

పోసీ, పటేల్‌గిరీ తీసుకో. నీఇష్టం వచ్చినట్టే గ్రామాన్ని నడుపు. నేనేదో చేస్తున్నానని మీరంతా అనుకోవడ మెందుకు?

వెంక : ఏమిటయ్యా పిచ్చోడా ఇంకా ఆలోచిస్తావు. కొండంత అండ దొరికింది. అదృష్టవంతుడివి. ఎద్దుముద్దీ పొడుచుకునే రాత నీకేం పట్టింది?

వీరా : పటేలంటే ఏమిటో నాకు తెలుసులెండి నాకేం అక్కర్లేదీ ఉద్యోగం.

జగ : సరే, నాచేతనైన సహాయమేదో చేస్తానన్నాను. తర్వాత నీ ఇష్టం.

వెంక : ఏమిటయ్యా వీరారెడ్డి నీ మీద అంత అభిమానంగా ఉన్న దొర వారికి వ్యతిరేకంగా నీవు పని చేయడమంటే నాకేం బావుండలా.

వీరా : ఎందుకండి బాబూ నామీద మీ కంత అభిమానం?

వెంక : ఎలాగైనా దొరవారి కులస్తుడివి.

వీరా : కులం అంటే నేనొకణ్నే గాదుగా ఊళ్ళో మూడు వంతులు రెడ్లే.

వెంక : కాబట్టే చెప్పుతున్నాను. రెడ్లే మన రెడ్డి దొరవారికి వ్యతిరేకంగా పని చేయడం ఏం సబబు?

వీరా : పండ్లూడ గొట్టుకోవడానికి వీరాయయితే ఏముందండీ వెంకట్రావు గారూ?

వెంక : శివ శివా! చల్లని ప్రభువు నెంత మాటన్నావయ్యా. అదిగో చూడు ఆ ఎదురుగా వున్న రామమందిరం కట్టించింది దొరవారు కదూ! అలాంటి పుణ్యాత్ముణ్ణి....

వీరా : అవును గొప్ప పని చేశారు. అరక్క పాతిక రూపాయల చొప్పున వసూలుజేసి కట్టించారు. ఎడ్లతో బండ్లతో నానా అవస్తలు పడి రాయీ రప్పా తోలింది మేము. చివరకు పేరు మాత్రం దొరగారిది.

[దేశముఖు వీరారెడ్డి వైపు గ్రుడ్లు మిటకరిస్తూ ఉంటాడు.]

వెంక : చాల్లేవయ్యో, బయస్దేరావ్ ఈ నాటికి పెద్ద దేశభక్తుడివి. నీమాత్రం దేశభక్తి అందరికీ ఉంది. (కట్టుపంచ చూపుతూ) మిల్లు బట్ట మానేసి ఆరు మాసాలనుంచీ నేనూ ఖద్దరు కడుతున్నాను, ఏమిటనుకున్నావో?

వీరా : అబ్బ! గొప్ప త్యాగమే చేశారు!

జగ : చేసినా మేమే చెయ్యాలి. నీవేం చేస్తావోయ్, సన్యాసి సన్యాసి రాసుకుంటే బూడిదే రాలేది.

వెంక: అంతే? మొన్న కస్తూరిబా ఫండుకి డబ్బు గావలసివస్తే దొరవారు నాలుగువేల రూపాయలిచ్చారు. నీవేం ఇచ్చావ్?

వీరా : అవును. మీలాగా ఆవుల్ని జంపి, చెప్పులు దానం చేసే ప్రభువులు చాలామంది వున్నారు. కాంగ్రెసు పేరు నాశనం చేయడానికి. ఇంకేం మీరు కూడా కాంగ్రెసులో కలవక పోయారా?

వెంక : అవునూ మేమూ కాంగ్రెసే. మొన్న నరసింగరావుగారు, రామ కృష్ణారావుగారు వచ్చినప్పుడు ఎక్కడ మకాం జేశారు? మా దివాణంలోనా? మీ గుడిసెల్లోనా?

వీరా : ఎందుకు మకాం జేయరు? అందులో ఒకరు దేశముఖు, మరొకరు జాగీర్దారు.

వెంక : ఏమయితేఁ నీవు వారికంటే గొప్ప దేశభక్తుడవా?

వీరా : నేనేం దేశభక్తుణ్ని లెండి. మీబోటి దేశముఖులు, పట్వారీల పంచ జేరిన ఆ పెద్దమనుషులే దేశభక్తులు. అలాంటి దేశభక్తుల చేతులతో కాంగ్రెసు తీర్థం పుచ్చుకున్న మీరు అంతకంటె గొప్ప దేశ భక్తులు.

వెంక : నీకు తోడు వాళ్ళకు వంకబెట్టపోయావ్. అసలు గాంధీగారు చెప్పిం దేమిటి? నీవు చేసేందేమిటి?

వీరా ; అదేమిటో తమరే సెలవివ్వండి?

వెంక : అసలు ఆ మహాత్ము డేమన్నాడు? రైతులకు దేశముఖులు, జమీం దార్లు ధర్మకర్తలుగా వుండాలన్నాడు. నీ వెక్కడో నాలుగు గాలి

కూతలు నేర్చుకొని, అసలు దేశముఖులే పోవాలన్నావటగా విన్న మీటింగులో.

వీరా : హుఁ, రైతులకు దేశముఖులు ధర్మకర్తలు! మేకలకు తోడేళ్ళు కాపలా అన్నమాట.

[అమీన్‌ని పిలవమని దేశముఖు మస్తాన్‌కి సైగ జేస్తాడు.]

జగ : ఆ లుచ్ఛాతో యెందుకోయ్ కంఠశోష. చెప్పుతినే కుక్కకు నెయ్యి కూడు ఇముడుతుందా?

వీరా : ఇది నెయ్యికూడు కాదు, విషపుకూడు. ఇలాంటి ఆశలు బెట్టే ఇది వరకు కొంతమందిని బోల్తా కొట్టించారు. కాని, ఇక ఆ మంత్రం అందరి మీదా పారదు. మీ పని మీరు చేసుకోండి. మా పని మేం చేసుకుంటాం. (వెళ్ళబోతాడు.)

[అమీన్ ప్రవేశం]

జగ : అమీన్‌సాబ్ (వీరారెడ్డిని అరెస్టు చేయమని సైగ చేస్తాడు.)

అమీన్: ఏయ్ ఠైరో.

[వీరారెడ్డి నుంచుంటాడు]

[వీరారెడ్డి దగ్గిరకెళ్ళి] గిరఫ్తార్.

[పోలీసులు వీరారెడ్డి చెరొక చెయ్యి పట్టుకుంటారు.]

[తెర పడుతుంది]

# 5

# వీరారెడ్డి ఇల్లు

[సీతమ్మ నాయకుల ఫొటోలు తీసి తుడుస్తూ, సామాన్లు సర్దుతూ పాడుతూ ఉంటుంది.]

గీతము పాడగదే — ధాటిగ
గీతము పాడగదే— ॥గీతము॥

(గాంధీజీ ఫొటో చూచి)

దున్నే వారికె అన్ని హక్కులని
దోచేవాడికి దోహద మీనని
పలికిన పలుకులు నిలుపుకొనాలని ॥గీతము॥

(నెహ్రూ ఫొటో చూచి)

తిండిని దోచే దుండగులందరి
గుండెల చీల్చే కుత్తుక నులిమే
తరుణమిదే గద త్వరపడవేమని ॥గీతము॥

(ఆంధ్ర మహాసభ నాయకుని ఫొటో చూచి)

రాక్షసి మూకల రక్త పిపాసుల
నురుమాడుటకై పరుగున రండని
పిలిచిన పిలుపును విని కదిలామని ॥గీతము॥

[కమల పక్కనుండి వింటూ పాట పూర్తి అవుతూ వుండగా ప్రవేశిస్తుంది. దాదా, సుభానులు కూడా బైటనుంచి ప్రవేశిస్తారు]

దాదా : (నవ్వుతూ) మమ్మాయి అప్పుడే సంఘం పాటలు కూడా నేర్చుకుందే!

సుభాన్: కమలమ్మ ఇంట్లో ఉండగా పాటలకేం తక్కువ?

కమల: (చిరునవ్వుతో) మా వదినకు నేను నేర్పేదేముంది? అన్నయ్య నేర్పాడు.

దాదా : అవునులే, మా అమ్మాయికి అన్నయ్య నేర్పాడు. రేపు వచ్చే మా మనమడికి నీవు నేర్పు.

సీత : ఈమె ఆయనకేం నేర్పక్కరలేదులే! ఆ అబ్బాయికూడా సంగం పెద్దేగా!

దాదా : ఇంకేం? చిక్కులేదు. ఇద్దరూ చెరొక జెండా ఏసుకొని ఊళ్ళెమ్మట తిరగొచ్చు. (కమల సిగ్గుతో తల వంచుకుంటుంది. సీతమ్మ నవ్వుతుంది)

సుభాన్: (సీతమ్మతో) ఏం వదినా అన్నయ్యేడీ. ఎక్కడికెళ్ళాడు?

సీత : మీకు కన్పడలా? మీ వెనకమాలే వచ్చారుగా!

దాదా : ఎక్కడికి? గడీకా?

సుభాన్: అక్కడకొస్తే మాకు కన్పడాలిసిందేగా!

కమల: రాముడొచ్చి అమీన్ రమ్మన్నాడని పిల్చాడు. మీరుకూడా గడికే వెళ్ళారని తెలిసి, అన్నయ్య కూడా అక్కడికే వచ్చాడు.

దాదా : అట్టాగా. అయితే ఆయనే దారినఎళ్ళాడో, మేం ఏ దారిన వచ్చామో!

సుభాన్: రానియ్. ఆయన దగ్గిరేం నాటకం ఆడుతున్నాడో అదీ తెలుసుకుందాం.

కమల: ఏమిటా నాటకం?

దాదా : ఏముంది, ఏదో ఒక విధంగా మమ్మల్ని బుట్టలో వేసుకోవాలని చూశాడు.

కమల: మిమ్మల్నే! బుట్టలో వేసుకోవాలని చూశాడుగా? ఏమన్నాడేంటి?

సుభాన్: ఏమంటాడు! మీరంతా హిందువులంట, మేం సాయిబులమంట నవాబుకు వ్యతిరేకంగా సాయిబులు పనిచేయడం తప్పంట, పాప మంట!

కమల: ఆయనకేం నవాబు! కొన్ని కోట్ల రూపాయలున్నాయి. మరి మీకెన్ని కోట్లున్నాయి?

దాదా : లేకేం. నాకూ ఉన్నాయి చినిగిపోయిన రెండు పాత కోట్లు.

సుభాన్: ఎక్కడివి. నీ పెండ్లికి కుట్టించినయ్యా?

దాదా : (నవ్వుతూ) అబ్బో! నా పెండ్లికి తోడు రెండు కోట్లు కూడానా? అందులో ఒకటి మా అయ్యది.

(అందరూ నవ్వుతూ ఉంటారు)

[రామిరెడ్డి, యల్లమందల ప్రవేశం]

యల్ల : (వస్తూనే) నాయాళ్ళు! యల్లమందంటే ఏందో అల్లాటప్ప అను కున్నారు!

దాదా : ఏం! మాజోరుగా ఉంది? వేశావా ఏంటి రెండు మంతలు?

యల్ల: ఏంది కల్లా! కల్లు సంగం పొత్తకంలో యేలద్దిన్నాడే మంత పగల నూకినా, ఏందనుకున్నావో!

దాదా : అయితే ఇవ్వాళ మస్తాన్ ఏమన్నా నీ చేతికి చిక్కాడా ఏంటి?

యల్ల : మత్తానయ్యే చిక్కినట్టయితే అబ్బా! టుర్ర్, కీ....

(అందరూ నవ్వుతారు)

రామి : తస్సదియ్య! ఇయ్యాల యల్లమంద వంకర కఱ్ఱ తిరగేసి నా సామి రంగ దంచో దంచు!

సుభాన్: ఎవర్ని? ఏమిటి?

సీత : ఏమిటి రామయ్యా! అసలెవర్ని కొట్టింది?

యల్ల: ఎవర్నేంది? లౌడీసుని.

దాదా : ఎందుకు? ఏం జరిగింది?

రామి : నా కసలు విర్రబట్టిందా, నా గిత్త బోయినకాడనుంచి. దివాణపు గొడ్లన్నీ చెవురు కెట్టాగూ రావాలిగా! మనాళ్ళందర్నీ తీసికెళ్ళి ఇయ్యాల కాపలాగాశా. ఎక్కడికిపోతుంది దొరక్క. దాని అబ్బగాడి బాకా? నీళ్ళు తాగుతూ ఉండగా పోయి గిత్తని పట్టుకున్నా.

సీత : వాళ్ళు చూస్తూ ఊరుకున్నారా?

రామి : ఆళ్ళేవళ్ళు అక్కయ్యా? ఆడి పాలేళ్ళంతా మన సంగంలోనే ఉంది!

యల్ల: పెద్ద మొగోళ్ళలాగ ఎవళ్ళో ఇద్దరు రౌడీనాయళ్ళు వచ్చారు జుట్టెగ రేసుకుంటా!

సుభాన్: (నవ్వుతూ) అదా సంగతి! ఆళ్ళిద్దరి పనీ నీవు బట్టావన్నమాట!

కమల: భలే పనిజేశావ్ యల్లమందా! సరే, కూచో! (యల్లమంద లోపలి కెళతాడు.)

రామి : మనదేముంది సుభాన్! అసలు గూడెం వెళ్ళాలి కనపడాలి. ఏం కట్టుగా ఉంది! చెరువు దగ్గిర కాస్తి గల్లంతు జరిగేటప్పటికి గుతపలు (లాఠీలు) తీసుకొని గూడెం అంతా కదిలి వచ్చిందనుకో మన తరపున.

సుభాన్: అవును మరి. ఈ దేశముఖు గూడాన్ని బెట్టిన తిప్ప లిన్నా అన్నా. నిలువునా ప్రాణాలు తోడాడనుకో. దేశముఖుని ఇవ్వాళ గూడెంలో అడుగు బెట్టమను. కనబడుతుంది వాడి బతుకు.

దాదా : నిజమే. వాళ్ళుకూడా మనతోపాటు చావుకీ బతుక్కీ తయారయ్యారు. కాని, గింజలు దొరక్క పాపం వాళ్ళు చాలా ఇబ్బంది పడుతున్నారంట.

కమల: పాపం వాళ్ళు అలా ఇబ్బంది పడుతూ వుంటే, మనం మాత్రం చూస్తూ ఎలా ఊరుకుంటాం. మన చేతనైన సహాయమేదో చేయాలిగాని.

సీత : మనుకున్న దాంట్లోనే కాసివి వాళ్ళకిచ్చి కానుక తాగమందాం. గానుగ లోదే గంపెడు. ఏం జేస్తాం?

దాదా : అంతేలే అమ్మా. తర్వాత తిప్పలేమన్నాగానీ.

[యల్లమంద పలక తీసుకొచ్చి, రొండున వున్న చెకుముకి సంచి తీసి అందులో నుంచి బలపంతీస్తూ వుంటాడు.]

రామి : అదేమిటోయ్ యల్లమందా, నీకు పలకెందుకు?

యల్లి : అచ్చరాలు రాపిచ్చుకోవాలి అమ్మాయి నేత.

[కమల చేతికి పలక, బలపం ఇస్తాడు]

దాదా : (ఆశ్చర్యంగా) ఓరి నీ దుంప తెగ! ఇప్పుడేం చదువోయ్ నలభై యేళ్ళు వచ్చాక?

యల్లి: ఓయ్? చదువుకోక పోతే యెట్టా! మన సంగంవారు వేసే కాగితాలు చదువుకోవద్దూ మరి! [అంతా నవ్వుతారు]

రామి : తస్సదియ్య! అట్టా వుండాలి పట్టుదలంటే!

సీత : చదువేమిటి పాటలు కూడా నేర్చుకుంటున్నాడుగా అమ్మాయి దగ్గిర!

దాదా : ఓరి నీ యేటుగాల! మా అందరికంటే నీవే మెరుగే: ఏదీ ఒక పాట పాడు.

యల్లి: వాయ్, పాటలు నాకేం వత్తయ్.

రామి : ఈ వేషాలన్నీ కుదరవు లేవోయ్. మా అక్కయ్య అబద్దం ఆడకేం! ఊఁ పాడవోయ్ పాడు (అంటూ చెయ్యిబట్టి లాగుతూ వుంటాడు)

సీత : నా మాట అబద్ధమైతే పంతులమ్మగా రెదటే వుందిగా అడగండి.

[కమల నవ్వుతుంది]

సుభాన్: సంఘం పాటలు నేర్చుకుంది దాచుకోవటానికా యేం: పాడవోయ్, మనకు భయమేమిటి?

యల్లి : పాట లెందుకయింది నాకు వచ్చింది. సుద్దులైతేను.

రామి : సుద్దులైతే మరీ మంచిది. తప్పకుండా పాడాల్సిందే.

కమల: ఇక తప్పదులే పాడు యల్లమందా.

యల్లి : ఒక్కా_డ్డి ఎట్ట బాడను? 'ఆ' కొట్టేవాళ్ళుండొద్దూ

రామి : నేనూ, సుభాన్ 'ఆ' కొడతాంలే కానీయ్, రా సుభాన్. (సుభాన్, రామిరెడ్డి యల్లమందకు చెరొక ప్రక్కన నుంచుంటారు. చెవికి చేయి ఆవించి, యల్లమంద 'ఆ(' అంటూ శ్రుతి గలుపుతాడు)

యల్లి : ఏంచయ్యా. 'ఆ(' కొట్టకుండా ఇకిలిస్తారేం?

సుభాన్:
రామి : | సరే కానీయ్. [ఇద్దరూ 'ఆ'అంటూ అతనితో శ్రుతి కలుపుతారు]

యల్లి : — సు ద్దు లు —

హరి హరి నారాయణ ఆదినారాయణ
కరుణించు మమ్మేలు కమలలోచనుడ॥

గొర్రెల గోత్రాలు గొల్లల కెరుక
గొల్లల గోత్రాలు గొర్రెల కెరుక
గొర్రె గొల్లల గోత్రాలు తోడేళ్ళ కెరుకో॥

పటేళ్ళ గోత్రాలు అమీన్ల కెరుక
అమీన్ల గోత్రాలు పటేళ్ళ కెరుక
అమీన్ల పటేళ్ళ గోత్రాలు గ్రామస్థుల కెరుకో॥

దేశముఖుల గోత్రాలు జాగీర్దార్ల కెరుక
జాగీర్దార్ల గోత్రాలు దేశముఖుల కెరుక
దేశముఖ్ జాగీర్దార్ల గోత్రాలు ఆంధ్రమాసద కెరుకో॥

నైజాం గోత్రాలు కుంపినోళ్ళ కెరుక
కుంపినోళ్ళ గోత్రాలు నైజాము కెరుక
నైజాం కుంపినోళ్ళ గోత్రాలు మా సంగంవారి కెరుకో॥

[సంతోషంగా అందరూ చప్పట్లు కొడతారు.]

దాదా : సెబాస్! బలేగా పాడావ్ యల్లమందా.

కమల: మరేమిటనుకున్నారు యల్లమందంటే! చూడండి. పది రోజుల్లో మన సంఘం పేపరే చదివేస్తాడు.

[యల్లమంద నవ్వుతూ గొంగళి కిందేసుకొని కూర్చొని అక్షరాలు దిద్దుకుంటూ ఉంటాడు.]

దాదా : మరచిపొయ్యాను. అస లియ్యాల మన సంగం పేపరొచ్చిందా?

రామి : రాకపోవడమేమిటి? నేనేగా రాత్రి తెచ్చింది!

సీత : దీపం బెట్టుకుని రాత్రి నడిజాందాకా చదువుతానే ఉంది అమ్మాయి.

దాదా : ఇయ్యాల సంగతు లేందో చెప్పలేదే అమ్మాయి.

సీత : కుంపిణీనుంచి ఎవళ్ళో మన దేశం చూడ్డానికొస్తే వాళ్ళమీద కూడా తుపాకులు కాల్చారంట! వీళ్ళ చేతులిరగ!

దాదా : ఎవళ్ళు బందరునుంచి వచ్చిన ఆ పెద్దమనుషులమీదనా, ఆ సంగతి మన కిదివరకే తెలిసిందిగా.

రామి : కుంపిణీనుంచి వాళ్ళస లిక్కడి కెందుకొచ్చారు సుభాన్?

సుభాన్: మన కష్టసుఖాలు తెలుసుకోడానికే.

యల్లి : మన కట్టసుకాలు తెలుసుకొని కుంపిణీలో వాళ్ళేం జేత్తారేంటి?

సుభాన్: కుంపిణీలో వాళ్ళంటే ఎవళ్ళు, వాళ్ళూ మన తెలుగోళ్ళేగా. మనం కష్టపడుతూవుంటే, మనోళ్ళు చూస్తూ ఊరుకుంటారా ఏమిటి? ఇక్కడ జరిగే సంగతులన్నీ కండ్లారా చూసి అక్కడికెళ్ళి మనా ళ్ళందరికీ చెప్పుదాం అని వచ్చారు.

యల్ల : అదిగదీ సంగతి! మళ్లీ ఇంటి కెల్లినాక ఈడ జరిగే అన్నేయమంతా మనాళ్ళకు జెప్తారుగా. అందుకనే అసలు ఆళ్ళను జంపేత్తే ఏ పీడా లేదనుకున్నారు, దొంగనాయాళ్ళు.

దాదా : ఇదంతా చేయించింది ఆ ప్రతాపరెడ్డేగా.

కమల: అవును, ఆ దుర్మార్గుడే.

రామి : ఎవడు? ఆ లక్ష ముప్పైవేల ఎకరమోడా?

సుభాన్: వాడే. ఊళ్ళ కూళ్ళు లేవగొట్టి తోటేసుకున్నాడు.

యల్ల : తల్లి సిగదరగ! తోటంటే తోటా! ఒకసారి దారి ప్రయాణం బోతా తోట కీ దరిని సద్దిదాగి బయల్దేరితే మళ్ళీ ఆ దరి కెల్లేటప్పటికి ఏను గూకిందంటే నమ్ము.

కమల: నిజమే అలాంటి పెద్ద తోట మొత్తం మన భారతదేశంలోనే లేదంట!

సుభాన్: వాడి ముల్లేంబోయింది యెంత తోటైనా వేయిస్తాడు, చుట్టుపక్కల ఊళ్ళవాళ్ళందరిచేత వెట్టిజేయించి.

కమల: వేయించినన్నాళ్ళు వేయించాడు. ఇక ఆ పప్పులేమీ ఉడకవ్. ఆ ఊళ్ళన్నీ ఇప్పుడు సంఘంలో జేరాయి.

యల్ల: (హుషారుగా చంకలు గొడుతూ) చేరినయ్! ఇక కూసోని ఏడవమను.

సీత : సంగంలో జేరినందుకు మన్ని వీడే ఇన్ని ఇబ్బందులు పెడతన్నాడు. ఇక వాడెన్ని చెరలు పెడతన్నాడో వాళ్ళని.

సుభాన్: ఎందుకు బెట్టడు, పోలీసుల్ని తీసుకొచ్చాడు. పట్టపగలే కొంపలు దోయిస్తున్నాడు. ఆడోళ్ళ పరువు దీయిస్తున్నాడు. వాడు చేయగలిగిన దంతా చేస్తూనే వున్నాడు. చివరి కిప్పుడు మిలటరీ వాళ్ళని కూడా ఊళ్ళలో దింపాడు.

యల్ల : ఎవళ్ళని సిపాయోళ్ళనా? ఆళ్ళు మరీ కటికోళ్ళంటగా.

కమల: అయితేం? ఎలికబోను ఎలికేక్కి ఉంటుంది. పులి బోను పులికే ఉంటుంది. వాళ్ళేలికేస్తే మనాళ్ళు కాలి కేస్తున్నారు.

దాదా : ఏం వేస్తే ఏం లాభం? వాళ్ళకి తుపాకులున్నాయ్. మనకిలేవు.

యల్లి : అదేనే సిన్నయ్యా, అనలొచ్చిన సిక్కు. నాకుమల్లే ఆణ్ణి కర్ర బట్టుకొని బర్రిమీదికి రమ్మను. కనబడద్ది — దెబ్బకి నాయాల టుర్రీ, కీ....

సుభాన్: అందుకనే వీలున్నప్పుడు దెబ్బకి దెబ్బ తీస్తాం. వీలుతప్పితే తప్పుకొని ఆత్మరక్షణ జేసుకుంటాం.

యల్లి : ఆత్మరచ్చన. అదేంవయ్యా సుబానయ్యా?

కమల: 'ఆత్మరక్షణ' అంటే ఏంలేదు యల్లమందా. మన్ని మనం కాపాడుకోవడమే.

యల్లి : (పకపక నవ్వుతూ) ఏందీ? మన్ని మనం కాపాడుకోటం? ఓయ్! మరి మన్ని మనం గాపాడుకోపోతే, మత్తానయ్య గాపాడతడా? ఇక రెండు చేతుల్తో బువ్వదిన్నట్టే.

సుభాన్: అందుకనే మనంకూడా నేర్చుకుంటున్నాంగా!

రామి : ఏమిటి నేర్చుకునేది కబుర్లు. ఒకేపు పోలీసులొచ్చి ఊళ్ళో గూచుంటేను.

సుభాన్: గిత్తో గిత్తో అంటూ నిన్నటినుంచి ఎక్కడా అంతులేదు. ఇప్పుడొచ్చి నన్ను దబాయిస్తున్నాడు, నేర్పలేదని.

దాదా : అయిపోయిన పెండ్లికి బాజా ఎందుకు? ఇప్పుడన్నా మొదలెట్టండి తొందరగా.

[అంతా లేచి నుంచుంటారు. ఇంతలో రాముడు ప్రవేశం]

రాముడు: (వస్తూనే) సుబానయ్యా, సుబానయ్యా!

సీత : ఏమిటి రాముడూ?

రాముడు: బాబయ్యగారిని పోలీసోళ్ళు పట్టుకొని దొరవారి కొట్టో పెట్టిన్రు.

కమల: ఎవరిని! మన్నయ్యనా?

[ఔనని రాముడు తల ఊపుతాడు]

రామి : పదండహో! ఇంకా జూస్తారేమిటి?

రాముడు: అడ కొద్దుబాబూ, అడ చానామంది పోలీసులుంటారు.

రామి : ఏం ఉంటే, తేలేదేమిటో ఇప్పుడే తేలుద్ది.

యల్లి : అంతే. ఇయ్యాల అటో ఇటో తేలాలిసిందే. లేకపోతే ఏంది?

దాదా : ఎప్పటికి మల్లే ఏదో మాటాడ్డానికి పిల్చాడనుకున్నాగాని ఇంత కాడికి వస్తుందనుకోలేదు.

కమల: అన్నయ్యా అంతే అనుకున్నాడు. లేకపోతే అసలు వెళ్ళే వాడే కాదు.

సీత : నాకు మొదటినుంచీ భయంగానే ఉంది. తీరా వెళ్ళేటప్పుడన్నా చూడా, "రామయ్యనన్నా వెంట తీసుకెళ్ళరాదా" అని.

సుభాన్: మేం కూడా అక్కడే ఉంటాం అనుకొని వచ్చిఉంటాడు. ఏం రాములూ ఆయన్ని అక్కడే ఉంచారా? నాకా (స్టేషన్) కి తీసికెళ్తన్నారా?

రాములు: అప్పుడే ఏడ తీసికెల్తారు బాబూ. ఊరుమీద పడ్డానికి అంతా తయారవుతున్రు.

దాదా : ఊరుమీద పట్టానికా?

రాములు: ఇంకా పడ్డానికా ఏంది! ఈపాటికి అళ్ళు బయలుదేరి వత్తానే ఉండాలి. (సీతమ్మతో) నే నెల్తానమ్మగారూ!

సీత : సరే వెళ్ళు రాములూ.

[రాముడు వెళ్ళిపోతాడు]

సుభాన్: ఏం యల్లిఘంద! సమయం వచ్చింది. మన్ని మనం కాపాడుకోవాలి.

సీత : పదండయ్యా తొందరగా పదండి. ఆ పాపిష్టోళ్ళు ఎవళ్ళింటిమీద వచ్చి పడతారో!

యల్ల : ఎల్లాని కేంలే అమ్మా! మరి ఇక్కడో?

దాదా : నే నుంటానులే యల్లమందా, పదండి మీరు.

సీత : నీ విక్కడుంటే ఎట్టా దాదా! పిన్ని అసలే భయస్తురాలు. మాకేం ఫర్వాలేదులే.

దాదా : నీకు తెలవదులే అమ్మా. పెద్దోణ్ణి నేనుండికూడా మిమ్మల్ని ఒంటరిగా వదిలిపెడ్తే, రేపు అబ్బాయివచ్చి ఏం అనుకుంటాడు? మా ఇండ్ల దగ్గర సుభాన్ ఉంటే చాల్లే.

కమల: మాకేం భయంలేదులే దాదా. మమ్మల్ని మేం రక్షించుకోగలం. మీబోటి ముఖ్యులే ఇక్కడ గూచుంటే ఎలా? వెళ్ళి ఇంటింటికీ తిరిగి ముందు గ్రామాన్ని కట్టుదిట్టం చేయండి. పదండి.

రామి : సుభాన్, ముందు మనిద్దరం గూడెం వెళ్ళివద్దాం పద.

సుభాన్: దాదా నీ వెళ్ళి మన వెంకయ్యగారికి, సుబ్బయ్యగారికి చెప్పిరా; యల్లమందా నీ వెళ్ళి మీ పదిండ్లోళ్ళకి జెప్పు.

దాదా : సరే పదండి. చావో బతుకో ఇయ్యాల తేలిపోవాలి.

సీత : పదండి నాయనా, పదండి. ఎన్నాళ్ళు బతుకుతాం ఈ పాడు బతుకు. ఎప్పుడైనా చావాలిసిందే.

సుభాన్: మనం జేసిన ప్రమాణం మళ్ళీ ఒకసారి జ్ఞాపకం తెచ్చుకోండి. బొందిలో ఊపిరి ఉండగా ఈ దేశముఖ్‌కి లొంగి పోగూడదు. మన జన్మహక్కుల కోసం మనం తెగించి పోరాడుదాం. ఈ పోరాటంలో ఎప్పటికైనా విజయం మనదే.

బోలో ఆంధ్ర మహాసభకీ జై!

[కమల పాట అందుకుంటుంది. అందరూ కలసి పాట పాడుతూ బయల్దేరి వెళ్ళుతూ ఉంటారు.]

ఆంధ్రుడా లేవరా
ఆంధ్రుడా విరావ లేవరా ॥ఆంధ్రుడా॥

ఆంధ్రమాత వీరమాత అనెడి పేరు నిల్పరా
కూలి-రైతు విప్లవాగ్ని జ్వాల లేపి నిలపరా
నేలమట్టమౌను ధనిక పాలనంబు నేడెరా ॥ఆంధ్రుడా॥

నెత్తురొలికి పారినా నీది శిరసు రాలినా
కత్తి దూసి శత్రువులను గదిమి గదిమి కూల్చరా
ఆంధ్ర ప్రజల మూడుకోటు లైక్యమై ఎదిర్చినా
బంధములను త్రెంచి విశాలాంధ్ర నిల్పగలమురా ॥ఆంధ్రుడా॥

[కమల, సీత మినహా అందరూ వెళతారు]

కమల: వదినా, అన్నయ్య లేడని వాళ్ళు గబగబా మనింటికే వస్తారేమో. గడపదాటి లోపల అడుగు పెట్టనివ్వగూడదు.

సీత : నా ఇంట్లోనే అడుగు బెట్టనిస్తానూ. సరేగాని నీవు మాత్రం కాస్త జాగ్రత్తగా ఉండమ్మా. వాళ్ళసలే కోతిముండాకొడుకులు.

కమల: అయితే ఏం? మనమే అంత జేతులు జచ్చి ఉన్నామా?

సీత : అంతేలే. మన చేతనైనంత మట్టుకు పోట్లాడదాం. నీవు మాత్రం తొందరపడక నేను జెప్పినమాటిను.

కమల: ఏమిటి వదినా, అలా అంటావ్?

సీత : ఏం లేదులే అమ్మా, నీవసలే చిన్నపిల్లవి. నీ విక్కడే వుండు, నే గడపలో నుంచుంటా.

కమల: అదేమిటి? నేనుకూడా నీతోపాటే నుంచుంటాను.

సీత : కాదులే, నీకు తెలీదులే. నేనే వుండాలి గడపలో, వాళ్ళసలే తాగుబోతుముండా కొడుకులు. నా ప్రాణం వుండగా నీ వంటిమీద చేయి బడనివ్వను.

కమల: (లోపలికి పరుగెత్తికెళ్ళి వడిశాల తీసికొస్తూ) మన చేతిలో ఈ ఆయుధం ఉండగా ఇంకా మన జోలికి రావడమే. (అంటూ బల్లపై కెక్కి వడిశాల తిప్పుతూ ఉంటుంది.)

సీత : (నవ్వుతూ) ఏం. కిందుండి నేను రాళ్ళందించనా?

(తెరలో పెద్ద కోలాహలం. సీతమ్మ గబగబా గడప దగ్గరకు పరుగెత్తు కొస్తుంది. పోలీసులు తలుపు తోసుకుని లోనికి వస్తూ ఉంటారు)

సీత : ఎవళ్ళురా మీరు ఇంట్లోకి వస్తారు?

పోలీ : లే, అడ్డంలే, ముందు ఇల్లు సోదా చేయాలి.

సీత : ఎందుకు?

పోలీ : 'లెవీ' ఎగ్గొడితే ఊరకే పోతుందనుకున్నావేం?

అమీన్: (ప్రవేశించి పోలీసుతో) అరే హేస్టి చూస్తావ్‌గదా: జల్దీ జల్దీ సామాన్ బైటికి లాగేయ్ బే.

[పోలీసులు లోపలికి వెళ్ళబోతారు. సీతమ్మ అడ్డం వస్తుంది. కమల లోపలికి పరుగెత్తుతుంది. "ఏయ్ జావ్, హటో" అంటూ అమీన్ సీతమ్మను బైటికి లాగుతాడు. సీతమ్మ పడిపోతుంది. పోలీసులు, రౌడీలు, అమీన్, మస్తాన్, దేశముఖు, పట్వారీలు లోపల ప్రవేశిస్తారు. గాంధీ, నెహ్రూ వగయిరా నాయకుల ఫొటోల దగ్గర నుంచి చేతికందిన ప్రతి సామాను బైటికి గిరవాటు వేస్తూ ఉంటారు. కమల కారపు ముంత తీసుకొని లోపలినుంచి వస్తుంది. కమలను చూచి దేశముఖు వికటంగా నవ్వుతూ, "చిక్కక ఎక్కడికి బోతావులే పిల్లా" అంటూ చేతులు జాచుకొని గుడ్లురుముతూ కమలమీది కెళుతూ ఉంటాడు. సీతమ్మ త్వరత్వరగా లేచి పక్కనున్న రోకలిబండ అందుకొని వెనగ్గా వచ్చి దేశముఖు తలపెదబెట్టి బాదుతుంది. దేశముఖు కెవ్వున ఒక పిచ్చికేక వేసి కిందబడతాడు. పోలీసులు, రౌడీలు సీతమ్మ మీద పడబోతారు. కమల కారపు ముంతలోంచి రెండు గుప్పెళ్ళ కారంతీసి అందరి కళ్ళల్లో కొడుతుంది. అందరూ కళ్ళు

నిలుపుకుంటూ వుంటారు. ఇంతలో వెనకనుంచి ప్రజల జయజయ ధ్వానాలు వినబడుతూ వుంటాయి. అందరికంటే ముందు దాదా పరుగెత్తుకుంటూ వస్తాడు.]

దాదా : అదోళ్ళమీద కెళ్ళడానికి మనుషులు గాదటరా మీరు. గాడ్దె కొడుకుల్లారా. (అంటూ సింహంలాగా గర్జిస్తూ వచ్చి పారిపోడానికి తొరాడుతూవున్న పట్వారీని లాగి ఒక తన్ను తంతాడు. పట్వారీ ఆ దెబ్బకి గింగరాలు తిరిగి కిందబడతాడు ఇంతలో అమీన్ తనచేతిలో వున్న రివాల్వర్‌ని దాదావైపు గురిపెట్టి కాలుస్తాడు. దాదా పొత్తి కడుపులో నుంచి గుండు దూసుకుపోతుంది. "అల్లా! అల్లా!" అంటూ దాదా నేలమీదపడి తన్నుకుంటూ ఉంటాడు. పట్వారీ—దేశముఖులు లేచి మెల్లగా తప్పించుకొని పారిపోతారు. సీతమ్మ "దాదా దాదా" అంటూ పరుగెత్తుకొచ్చి దాదా తలను పట్టుకొంటుంది. అమీన్ మళ్ళీ రివాల్వర్ కాలుస్తాడు. గుండుతగిలి సీతమ్మ పడిపోతుంది. సుభాన్, రామిరెడ్డి, యల్లమందలతో సహా ఇంకాకొందరు ప్రజలు పరుగెత్తు కుంటూ వస్తారు. అమీన్‌తో సహా పోలీసులు కూడా పిక్కబలం జూచి పరుగుబుచ్చుకుంటారు. "వదినా, వదినా" అంటూ కమల సీతమ్మ దగ్గరకు వస్తుంది. ఇంతలో మరో వైపునుంచి చెమట గారుతూ రొప్పుతూ వీరారెడ్డి, మంగలి రాముడు ప్రవేశిస్తారు.)

వీరా : (దాదాను జూచి) దాదా దాదా (అంటూ గుండెమీద చేయివేసి ముక్కు దగ్గిర వేలుబెట్టి చూస్తూ వుంటాడు. మంగలి రాముడు లోపలకి పరుగెత్తి నీళ్ళు తీసుకొస్తాడు. వీరారెడ్డివైపు జూచి కమల 'అన్నయ్యా' అంటూ కేకవేస్తుంది. వీరారెడ్డి సీతమ్మ దగ్గరకు పరు గెత్తుకుంటూ వస్తాడు.)

సీత : (సీతమ్మ వీరారెడ్డివైపు జూచి క్షీణస్వరంతో) దాదా, దాదా.

వీరా : ఇంకెక్కడి దాదా (మంగలి రాముడు దగ్గిర నీళ్ళుతీసుకొని సీతమ్మ చేత రెండు గుక్కలు తాగిస్తాడు.)

సీత : దాదా పొయ్యాడా, పొయ్యాడా; పాపం మనకోసం .... చచ్చి పొయ్యాడా. (కొంచెం సేపు ఆగి, కమలవైపు చూచి) ఏడవకమ్మా ఏడవకు; అబ్బాయేడీ?

(కన్నీరు తుడుచుకుంటూ కమల లోపలి కెళుతుంది.)

(వీరారెడ్డితో) మీరెట్టా....వచ్చారు?

వీరా : (కన్నీరు తుడుకుంటూ) రాముడు తప్పించాడు.

సీత : రాముడా? (రాముడు వైపు జూస్తుంది)

రాముడు: (కండ్ల నీళ్ళు తుడుచుకుంటూ) ఏం తప్పిస్తే ఏం లాభమమ్మా.

[అబ్బాయి నెత్తుకొని కమల ప్రవేశిస్తుంది. సీతమ్మ చేతులు చాచు తుంది. అబ్బాయిని కమల సీతమ్మ చేతుల్లోకి ఇస్తుంది.]

సీత : (అబ్బాయిని ముద్దాడి మళ్ళీ కమల చేతికిస్తూ) బిడ్డని నీ చేతుల్లో పెడతన్నా, వీడికిక....నీవే....నమ్మా....తల్లివి.

[కమల అబ్బాయిని తీసుకుంటూ వుంటుంది]

[ తె ర ]

# 6

# సమాధులు

[సీతమ్మ, దాదా సాహెబుల సమాధులు. కమల, వీరారెడ్డి, సుభాన్, రాముడు చేతులు జోడించి పాడుతూ ఉంటారు. వీరారెడ్డి చేతిలో బేబీ వుంటుంది. సమాధులపై అగరువత్తులు వెలిగించి, కమల వీరారెడ్డి చేతిలో నుంచి బేబీని తీసుకుంటుంది.]

దేశ సేవకులార తెలుగు జోదుల్లార
దేశానికై మీరు దేహమర్పించార! ॥దేశ॥

మీ కీర్తి చంద్రికలు మీ ధైర్య శౌర్యములు
లోకాన వ్యాపించి చీకటుల పోదోలె ॥దేశ॥

హిందువులు ముస్లిములు ఏకమై ఈనాడు
మీ రక్తవాహినులు పారి తడిసెనచోట
స్వాతంత్ర్య ధ్వజమెత్తి జయగీతి పాడెదము ॥దేశ॥

రాముడు: ఇద్దరూ ఇద్దరే దేవతలు. ఇట్లాంటోళ్ళ మీద తుపాకులు కాల్చిన్రు. రాచ్చస ముండా కొడుకులు.

కమల: "నా బొందిలో ప్రాణం ఉండగా నీ వంటిమీద చేయిపడనిస్తానా అమ్మాయీ" అంది. కంటి రెప్పలాగా ఎప్పుడూ నన్ను కనిపెట్టి ఉండేది.

రాముడు: కోప మెట్టాంటిదో ఎరుగదు మా తల్లి. మాబోటి పని బాగు లోళ్ళని కూడా తూలి ఎప్పుడూ ఒకమాట అని ఎరగదు.

సుభాన్: అదేమిటో! వాళ్ళిద్దరూ తండ్రీ బిడ్డలులాగా ఉండేవాళ్ళు. నవ్వులాటకైనా సరే, దాదాని మనం ఏమన్నా అంటే ఆమె ఊరుకొనేది కాదు.

కమల: దాదా మాత్రం పేళాకోళానికయినా వదినమీద మాట పడనిచ్చే వాదా! మమ్మల్ని మరీ తన కన్నబిడ్డల్లాగా చూచుకునే వాడు.

వీరా : మిమ్మల్నేకాదు. అందర్నీ ఆలాగే చూచుకునేవాడు. మనలో ఎవరికి ఏ కాస్తి కష్టం కలిగినా ఆయనెంతో బాధపడేవాడు.

సుభాన్: మనలో ఈ యిద్దరే ప్రతి దానికి వెనక్కు లాగుతారవి అనుకునే వాణ్ణి. తీరా సమయం వచ్చేటప్పటికి మనందరికోసం ముందు వాళ్ళే బలి అయ్యారు.

వీరా : మనతో బాటు ఆవేశంగా మాట్లాడక పోయినా ఏ పనిలో వాళ్లు మనకంటె వెనకబడ్డారు? సమయం వచ్చినపుడు ఎప్పుడూ ముందే నుంచునేవాళ్ళు.

రాముడు: ఇట్టాంటోళ్ళని పొట్టన బెట్టుకొని గాడిద కొడుకులు పారిపోయిన్రు. చిక్కినట్టయితేనా? బతికుండగా గొయ్యితీసి పాతిపెట్టేవాళ్ళం.

సుభాన్: పాతిపెట్టక అప్పుడే ఏమయింది? మనలో ఒక్కడు బతికున్నా సరే, ఈ దేశముఖు అంతు కనుక్కోకుండా వదిలి పెడతామా?

[పట్వారీ వెంకట్రావును రామిరెడ్డి వగైరా రైతులు మెడబట్టి నెట్టుకుంటూ ప్రవేశిస్తారు. వెంకట్రావు అమాంతంగా వచ్చి వీరారెడ్డి కాళ్ళమీద పడతాడు.]

వెంక : (ఏడ్చుకుంటూ) రక్షించాలి బాబో రక్షించాలి.

రామి : ఏమిట్రా? నిన్ను రక్షించాలా? పగలగొయ్యాలా?

[అంటూ వెంకట్రావు మీది కెళతాడు]

వెంక : బాబో శరణాగతుణ్ణి. ఈ దీనుడికి ఇక మీరే దిక్కు. బుద్ధి వచ్చింది.

కమల: (కోపంతో) మొన్న ఎక్కడబోయింది ఈ బుద్ధి. సిగ్గులేదూ! వేలు బెట్టి నన్ను జూపించావే మొన్న దేశముఖుకి. నాబోటి పిల్లలు నీకు లేరూ, దుర్మార్గుడా.

రామి : ఏమిటీ? వీడేనా నీ మీదికి దేశముఖుని ఉసికొల్పింది? ఏంరా గాడిద.

(లాగి ఒక తన్ను తంతాడు.)

వెంక : (క్రిందబడి చేతులు జోడించి) అపరాధిని బాబో, బుద్ధిగడ్డి తింది. పిల్లలు గలాణ్ణి.

వీరా : ఎవళ్ళకి లేరు పిల్లలు?

సుభాన్: కమల (చేతిలోనుంచి బేబీని తీసుకుంటూ) ఎంతమంది ఇలాంటి పిల్లల ఉసురు గట్టుకున్నావురా నీవు. ఈ బిడ్డ తల్లి రక్తం తాగింది నీవు కాదూ?

వెంక : ఈ పాపం నేను చేయలేదు బాబూ. దైవసాక్షిగా జెప్పు తున్నాను. ఈ కాల్పులతో నాకేం సంబంధం లేదు.

రాముడు: నోట్లో పురుగులు పడ్తయ్. ఆ మాతల్లిని చంపించిందిగాక, ఇప్పుడు కూడా అబద్దాలెందుకు? గదిలో కూసోని అమీన్‌తో గుసగుసలాడింది నీవుగాదూ? (వీరారెడ్డిని చూపించి) ఈ బాబయ్యని కొట్టోబెట్టి మేం వచ్చిందాకా జాగర్తగా కావల గాయమని నాతో చెప్పలా.

వెంక : దుర్మార్గుణ్ణి బాబో. ఇక మీరేమన్నా జేయండి. మీ కాళ్ళమీద బడుతున్నా. ఉద్యోగ ధర్మం కాబట్టి అలా ఏడవాలిసి వచ్చింది.

గుమస్తా ముంతాకొడుకుని నాదేముంది బాబూ. ఆ దేశముఖ్ చెప్పినట్టల్లా చేశాను.

రామి : మా దగ్గిరటంరా నీ దొంగ ఏడ్పులు. అమ్మ పుట్టిల్లు మేనమామకి తెలియపటరా? అసలీ ఊరికి తిప్పలు దెచ్చింఁదీ, మా కొంపలన్నీ దీసింఁదీ నీవు గాదటరా గాడిద! (మళ్ళీ తన్నబోతాడు.)

వెంక : చేశాను బాబో చేశాను. బుద్ధి వచ్చిందని లెంపలు వేసుకుంటున్నా- క్షమించండి. ఇక ఈలాటి బుద్ధి తక్కువ పనులెప్పుడూ జేయను.

కమల: ఛీ నీచుడా! నీకా బుద్ధి? ఇక నిన్ను తగలేసిన్నాడే నీకు బుద్ధి వచ్చేది.

వెంక : (చెంప లేసుకుంటూ) చెంపలేసుకుంటున్నాను తల్లి, ఇక మీరు చెప్పినట్టే నడుచుకుంటా. మీరు దూకమన్న గోతిలోకి దూకడానికి సిద్ధంగా ఉన్నా. (చేతులు జోడిస్తూ) హరేందానుణ్ణి మీకే జరిమానా విధించినా చెల్లించుకుంటా. మీరే శిక్ష వేసినా అనుభవిస్తా.

రామి : శిచ్చ. ఇంకా శిచ్చేమిటి? ఈ గోరీలతోపాటు నీకూ ఒక గోరీ కట్టడమే.

కమల: ఈ దేవతల గోరీల పక్కనా, ఈ నీచుడికి గోరీ కట్టేది?

రాముడు: నిజమేనమ్మా మంచిమాట చెప్పావు.

వీరా : (పట్వారీతో) నీవు జేసిన దుర్మార్గాలకి నిన్ను ఉరిదీసినా పాపంలేదు. నీ కల్లబొల్లి కబుర్లు నమ్మి నిన్నింకా ఊళ్ళో ఉండనివ్వడం, మళ్ళీ మా గొంతుకల కుచ్చు బిగించుకోడమే. ఛీ, నీ మొఖం చూసినా పాపం, పో అవతలికి.

రామి : జాగ్రత్త. మళ్ళీ ఊళ్ళో అడుగు బెట్టావూ అంటే బతికి బైటపడవు.

వెంక : (వీరారెడ్డితో) నా పెండ్లాం బిడ్డల్ని వదిలి ఎక్కడికి పోను బాబూ?

వీరా : ఎక్కడికన్నాబో ఏట్లోకి. నీతోపాటే తీసికెళ్ళు నీ పెండ్లాం బిడ్డల్ని.

వెంక : ఈ గడ్డ వదిలి పెండ్లాం బిడ్డలతో ఎక్కడికిపోయి, ఏందిని బతకను? అన్యాయంగా జచ్చిపోతా బాబూ.

రామి : ఏం చచ్చిపోతే. అసలు నీవు చావాలిసిందే.

సుభాన్: ఈ గడ్డంతా నీతాతగాడి ముల్లే? నీవు కష్టపడి సంపాదించి చచ్చావా? ఇదంతా మా పొట్టగొట్టి కాజేసిందేగా.

వీరా : వేలకు వేలు మా దగ్గర లంచాలు కాజేసి మేడ గట్టించుకొని అందులో కులుకుతూ కూర్చుందామనుకున్నావా? పద, నడువుముందు బైటకి.

వెంక : నేను దీసుకున్న లంచాలన్నీ ఇచ్చేస్తా బాబూ, నా పొలం మాత్రం నాకు వదిలి పెట్టండి.

వీరా : నీవు తీసుకున్న లంచాలన్నీ లెక్కకడితే, నీ ఆస్తి మిగలదు, నీవూ మిగలవు. బతకదల్చుకుంటే నడువు ముందు బైటకి.

[యల్లమంద మస్తానును లాక్కొస్తూ ఉంటాడు.]

యల్ల : నడువ్, నడువ్ (మస్తానును తోసుకొస్తూ, పట్వారీని చూచి) వోయ్, చిక్కిండే పిలకోడు (పట్వారీ మెడ బట్టుకొని ఊపుతూ) నాయాల కొట్టి ఏలుముద్దర ఏయిత్తావ్.

[మస్తాన్ తల వంచుకొని నుంచుంటాడు]

సుభాన్: థూ, నీ జన్మ తగలెయ్య, సిగ్గులేక ఇంకా బతికుంటావ్. ఎందులో అన్నా దూకి చావకపొయ్యావా? దాదాని, సీతమ్మగారిని పొట్టన బెట్టుకున్నావు చాల్లా?

యల్ల : తేరగా వచ్చింవని దేవరపోతు మాంసం తెగదిని చూడు ఎట్ట బలిసిండో.

సుభాన్: ఛీ. ఈ దుర్మార్గుడిక్కడెందుకు? మెడబెట్టి గెంటవ వాడితో పాటు.

(మెడబెట్టి గెంటుతాడు)

రామి: (పట్వారీని చూచి) ఇంకా నీ దిక్కడే చచ్చా వెందుకు, పో వాడితోపాటు నీవు కూడా. [జుట్టు పట్టుకొని బైటకి లాగుతాడు]

కమల: ఈ గాడిద లిద్దరూ చిక్కారు గాని, అసలోడు చిక్కలేదే!

యల్లి : వోడు? దేశముఖా? ఆడు అమీన్‌తో గలిసి నల్లగొండ పారి పోయిండు. ఎంటబడితే దొరకలా నాయాళ్ళు. గుర్రాలేసుకొని ఉరికిర్రు.

[రామరెడ్డి, సుభాన్లు మళ్ళీ ప్రవేశిస్తారు.]

రాముడు: పీడ వదిలింది.

వీరా : పదండి పోదాం. మన పొలాలు మనం ఆక్రమించుకుందాం.

కమల: ఎన్నాళ్ళ నుంచో మన తల్లి భూదేవి ఈ పాపాత్ముడి చెరలో వుంది. పదండి. మన భూమిని మనం వదిలించుకుందాం.

రామి : ఇక నా గిత్తలకి మేత కరువులేదు. మళ్ళీ నా బీడు నా కొచ్చింది.

రాముడు: (సంతోషంగా వీరారెడ్డితో) ఏం బాబూ, మళ్ళీ మా పుంగలి మాన్యం మా కొచ్చినట్టేగా!

సుభాన్: ఇంకా వచ్చినట్టేనా ఏంటి? వెళ్ళి అరం కట్టక!

వీరా : ఈ నాటికి తిరిగి మళ్ళీ మన భూములు మన కొచ్చాయి. కాని ముందు మరో ప్రమాదం రాబోతూ వుంది. మనమంతా తగిన జాగ్రత్తగా వుండాలి.

యల్లి: ఇంకేం బయముంది బాబూ. ఆ ముదనష్టపోడు ఆడిదారిని ఆడు బోయిండుగా.

వీరా : అప్పుడే ఎక్కడ బోయాడు? వాడు జేయాల్సిన కుట్ర అంతా జేస్తూనే వుంటాడు. పట్నంకూడా బోయి ఈసారి మిలటరీనే తీసు కొస్తాడు. అవసరమైతే ఇంకా తెల్ల సైన్యాన్ని కూడా దింపుతాడు.

రామి : ఏం దింపితే? మాదొందిలో ఊపిరి ఉండగా మళ్ళీ మా పొలాలు వదిలి పెడతామా?

సుభాన్: సంఘ బలంతోనే ఇప్పుడు దేశముఖుని ఎదిరించాం, రేపు నవాబు వచ్చినా, తెల్లోళ్ళు వచ్చినా, ఈ సంఘం బలంతోనే ఎదిరించుదాం. మన గడ్డని మనం కాపాడు కొందాం.

కమల: అంతే. మనమంతా ఇలాగే కట్టుగా ఉంటే తెల్లోళ్ళు కాదు, వాళ్ళ తాత లొచ్చినా మన్ని ఏమీ చేయలేరు.

యల్ల : ఈ జాతోళ్ళు కోతోళ్ళు ఏం జేత్తారే పసందర. ఎవడి పొలంకో ఆడు ఇగ్లేసుకుందాం, ఏం రాములు?

రాముడు: అంతేనయ్యా, యల్లమందయ్యా, నా ప్రాణం దోయినా సరే, ఇంకా నా మాన్నెం వదిలి పెడతానా?

వీరా : అలా వుంటాలి. అవసరమైతే ఇంటికొకడు బలి అయిపోవాలి. పొలం మీద హక్కు మనదే. ఈ హక్కు కోసమే సీత తన ప్రాణాన్ని ఇచ్చింది. దాదా బలి అయిపొయ్యాడు. మళ్ళీ మన పొలాన్ని మనం వదిలి పెట్టడమంటే దాదాకి, సీతకి ద్రోహం చేసిన వాళ్ళం అవుతాం.

సుభాన్: నిజమే బందగి సమాధి దగ్గర మొదట మనం సంఘం బెట్టుకుంటాం అని ప్రమాణం చేశాం. మళ్ళీ ఈ సమాధుల దగ్గర ప్రమాణం చేయండి.

"ప్రాణం బోయినా మాభూమి వదలం"

అందరూ: ప్రాణం బోయినా మాభూమి వదలం.

వీరా : దున్నే వారిదే భూమి హక్కు!

అందరూ: దున్నే వారిదే భూమి హక్కు!

కమల: బోలో ఆంధ్ర మహాసభకీ జై!

అందరూ: బోలో ఆంధ్ర మహాసభకీ జై!

వీరులార రణధీరులారా నిరు
పేదలార ఇదే కదలండోయ్॥
పౌరుష మేదో చూపి దేశమును
ప్రజా రాజ్యమును నిలుపండోయ్॥
భూమిలేని రైతేమి రైతురా
భూమిని దున్నే బానిసరా॥
బానిస బ్రతుకునకంటె హేయ మీ
ప్రపంచమున లేనే లేదోయ్॥
బానిసలంతా ఏకమైన ఈ
ప్రభువు లెంతరా ఒక క్షణమే॥
పగలు రాత్రి కష్టించి భూములను
పగులదున్ని పండించెదమోయ్॥
దున్నే వానిదె హక్కు భూమిపై
ఇది మా భూమేనోయ్
ఇది మా భూమేనోయ్॥

[ సమాప్తం ]



08832002100.

9441841585.

98



సుంకర సత్యనారాయణ

జననం : 23, మార్చి, 1909

ఈడ్పుగల్లు

మరణం : 9 సెప్టెంబరు, 1975

* * *



వాసిరెడ్డి భాస్కరరావు

జననం : 2, సెప్టెంబరు, 1914

వీరులపాడు

మరణం : 1, నవంబరు, 1957

